# ఆంధ్రపత్రిక సచిత్ర వార పత్రిక



4 అణాల
27-3-

ANDHRA PATRIKA

# ఎన్నికల యజ్ఞం

భారతదేశం రిపబ్లిక్‌గా అవతరించిన తర్వాత దేశవ్యాప్తంగా ఎన్నికలు జరుపుకోవడం ఇది రెండవసారి ఈ రెండవ సాధారణ ఎన్నికలు మొన్న 14-వ తేదీతో సమాప్తమైనవి. మొదటి ఎన్నికలలో కనబడినంత ఉత్సాహం కనిపించక పోయినప్పటికీ, మొత్తంమీద ప్రజలు ఆవేశరహితంగాను, అతి ప్రశాంతంగాను వీటిని నిర్వహించడంలో ప్రభుత్వానికి చాలా సహాయపడ్డారనే చెప్పాలి హిమావృత ప్రాంతమైన హిమాచల్ ప్రదేశ్ లోను, తూర్పు పంజాబులోని కాంగ్రా ప్రాంతంలోను మాత్రం మిగతా ప్రాంతాలన్నిటితో పాటు ఇప్పుడు ఎన్నికలు జరగలేదు హిమబాధ తొలగిపోగానే మే నెలలో అక్కడ కూడా ఎన్నికలు పూర్తిచేస్తారు.

ప్రజాస్వామ్య పరిపాలనా విధానానికి ఎన్నికలు పట్టుకొమ్మలాంటివి పరిపాలనా వ్యవహారాలలో ప్రజలు తమ అభీష్టాన్ని ఎన్నికలద్వారా వ్యక్తీకరించడమన్నది అతి ప్రాచీనకాలంనుంచీ వస్తున్న ఆచారమేనని చెప్పడానికి చాలా నిదర్శనలున్నవి అయితే ఎన్నికలలో వోట్లువేసే పద్ధతిమాత్రం దేశకాలపరిస్థితులనుబట్టి మారుతూ వచ్చినట్లు కనిపిస్తుంది వోట్ల కాగితాలకు బదులు ప్రాచీన భారతదేశంలో తాళపత్రాలు మొదలైనవాటిని ఉపయోగించినట్లు చరిత్రకారులు పరిశోధించి తెలుసుకోగలిగారు.

స్పార్టాన్ జాతిప్రజలు పెద్దపెట్టున ఎలుగెత్తి కేకవేసి ఎన్నికలలో తమ వోటును నమోదుచేసేవారని ప్రతీతి మరికొన్ని సమయాలలో బల్లెములను డాలులమీద కొట్టి ఖంగు ఖంగున శబ్దం చేయడం ద్వారాకూడా తమ అభిమతాన్ని వ్యక్తీకరించేవారట ఎథిని యన్‌లు చేతులుపైకెత్తి తమ అభిప్రాయాన్ని స్పష్టీకరించేవారు వోటింగు రహస్యంగా జరగవలసి వచ్చినపుడు లెక్కపెట్టడానికి వీలుగా చిన్నచిన్న రాళ్ళను ప్రత్యేక భాండాలలో పడవేసేవారట కూడా. ప్రాచీనకాలంలో రోమక్ పౌరులు మైనం పూసిన చెక్కముక్కలను వోట్ల కాగితాలుగావాడుతుండేవారని చరిత్ర చెబుతున్నది.

ఏ అభ్యర్థికి ఎవరువోటు వేసింది రహస్యంగా వుండాలనే విషయాన్ని ఇప్పుడు దాదాపు అన్ని దేశాలవారూపాటిస్తున్నారు ఇది సరిగా శతాబ్దం క్రితం 1856 లో మొట్టమొదటి సారిగా దక్షిణ ఆస్ట్రేలియాలో ప్రారంభమైంది దీన్ని ఇప్పటికీ "ఆస్ట్రేలియన్ బాలెట్" పద్ధతి అనే సర్వత్రా వ్యవహరించడం జరుగుతున్నది. తర్వాత రెండు మూడు దశాబ్దాలలో యూరప్, అమెరికా ఖండాలలోని కొన్ని రాజ్యాలలో కూడా ఇది ఆచరణలోకి వచ్చింది. ఇప్పుడు సర్వసర్వత్రా ఇదే పద్ధతిని పాటిస్తున్నారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి ముందుకూడా హంగరీలో ఎన్నికల నిబంధనలు బహిరంగ వోటింగు విధానాన్నే అనుమ



చిత్తూరు నియోజకవర్గంనుంచి లోక్ సభకు ఎన్నికైన స్పీకరు శ్రీ అనంతశయనం అయ్యంగార్



తెనాలి నియోజకవర్గంనుంచి లోక్ సభకు ఎన్నికైన శ్రీ ఎన్. జి. రంగా

తిస్తాం చేసి. ఈనాడు సవనాగరిక దేశమని చెప్పుకుంటున్న ఫ్రాన్సులో కూడా దాదాపు అర్థశతాబ్దం క్రితంవరకూ పోలింగు కేంద్రాలవద్ద నిలుపల తమతమ వోటర్లకు పోటీ చేస్తున్న అభ్యర్థులే వోటుకాగితాలను పంచిపెడుతూండేవారు ప్రజలు ఆ కాగితాలను మడిచి ఎన్నికల అధికారికి లెక్కింపుకోసం ఇస్తుండేవారు.

1933 లో నాజీ నియంత హిట్లర్ అధికారానికి రాకముందునుంచీకూడా జర్మనీలో వోటు ఎవరికి వేసిందీ తెలియకుండా చాలా కట్టుదిట్టమైన ఏర్పాట్లు వుండేవి ప్రతి వోటరూ వోటు కాగితాన్ని తీసుకుని తన అభిమాన అభ్యర్థి పేరు నమోదుచేసి, ఒక కవరులో పెట్టి భద్రంగా మూసివేసి (ఇదంతా ఒక రహస్య వోటింగు కేంద్రంలో జరిగేది) ఎన్నికల అధికారికి ఇచ్చేవాడు ఆ అధికారి ఆ కవరును వోటరు చూస్తుండగానే బాలెట్ పత్రాల భాండంలోవేసి భద్రపరిచేవాడు వోటరు ఏ అభ్యర్థిని అభిమానించిందీ ఇతరులెవరికీ తెలిసేదికాదు

వయోజనులందరికీ స్త్రీలకు, పురుషులకు వోటింగు హక్కు వుండాలనే పవిత్ర ప్రబోధం పంధొమ్మిదవ శతాబ్దం ఆరంభంలో వ్యాప్తికి వచ్చింది యుక్తాయుక్త విచక్షణ చేయగల వయస్సులో వున్న ప్రతి స్త్రీకీ, ప్రతి పురుషుడికి వోటు వుండాలన్నదే ఈ ప్రబోధ లక్ష్యం. అయితే ఈ వయస్సును నిర్ణయించే అధికారం ఆయా ప్రభుత్వాలకు మాత్రమే వుండేది కొన్ని దేశాలు ఈ వయస్సును పద్దెనిమిదేళ్ళుగాను, మరికొన్ని దేశాలు పాతికేళ్ళుగాను నిర్ణయించినవి స్వెయిన్, డెన్మార్కు, జపాన్, హాలెండు మొదలైన కొన్ని దేశాలలో ఈ వయః ప్రమాణం పాతికేళ్లు. మరికొన్ని ప్రముఖదేశాలలో ఇది ఇరవై ఒక్క ఏళ్లు భారతదేశంకూడా ఇదే ప్రమాణాన్ని నిర్ణయించింది వోటర్ వయః ప్రమాణం మాదిరిగానే కొన్ని దేశాలు ఎన్నికలలో పోటీచేసే అభ్యర్థికి కూడా ఒక కనీస వయస్సును నిర్ణయించినవి ఈ వయః ప్రమాణం ఒక్కొక్క దేశంలో ఒక్కొక్కవిధంగా వుంటున్నది రష్యా, బ్రిటన్ మొదలైన కొన్ని దేశాలలో వోటరు కనీస వయస్సే అభ్యర్థికికూడా వుండేచాలు నన్నారు అమెరికా, ఫ్రాన్సు, జర్మనీ, బెల్జియం, భారతదేశాలలో వోటరు వయస్సుకంటే అభ్యర్థి వయస్సు కొద్దిగా ఎక్కువ వుండాలని నిర్ణయించారు

కొన్ని కొన్ని దేశాలలో వోటర్లకు కనీసవిద్యార్హతలు నిర్ణయించాలనే ప్రయత్న

# ఎన్నికల యజ్ఞం

గ్నం తరుచూ జరుగుతూ వచ్చిందిగాని, ఆచరణలో అది కష్టసాధ్యంగా పరిగణించినందువల్ల ఆప్రయత్నాలనే విరమించవలసి వచ్చింది. అయినప్పటికీ కొన్ని చోట్ల ఇప్పటికీ ఏదో ఒక రూపంలో ఈ పాత కాలపు పద్ధతులు లేక పోలేదు. టర్కీలో ప్రతి వోటరుకూ టర్కిష్ భాషలో చదవడం, వ్రాయడం వచ్చి వుండాలనే నియమం వున్నది. అమెరికాలో ప్రతి వోటరుకూ చదవడం వచ్చునో రాదో పరీక్ష చేసిచూసే వాళ్లు. బ్రెజిల్, చిలీ దేశాలలో నిరక్షరాస్యులకు అసలు వోటుచేసే హక్కు లేదు. మన దేశంలో మాత్రం యుక్త వయస్కులైన స్త్రీ పురుషులందరూ స్వేచ్ఛగా వోటు చేయవచ్చు. ఫ్రాన్సు, ఇటలీ, జపాన్, స్పెయిన్, నెదర్లెండ్సు, బెల్జియం, పోర్చుగల్. గ్రీసు, దక్షిణాఫ్రికాలలో ఆడవాళ్లకు వోటు హక్కు వుండేదికాదు.

ఇక పోతే పోటీచేసే అభ్యర్థుల నామినేషన్ల విషయం బ్రిటన్‌లో ప్రతి అభ్యర్థి నామినేషన్ పత్రంమీద కనీసం ఎనిమిదిమంది వోటర్లయినా సంతకాలు చేసి బలపర్చాలి. ఇటలీలో మూడు వందల మంది సంతకం చేస్తేగాని ఆపత్రాన్ని ఖాతరు చేయరు. మన దేశంలో నామినేషన్ పత్రం మీద అభ్యర్థిత్వాన్ని ప్రతిపాదించే వ్యక్తి, బలపరిచే వక్తి ఇద్దరు మాత్రం సంతకాలు చేస్తే చాలు.

ఐదేళ్ళ కొకసారేఅయినప్పటికీ, ఎన్నికలు నిర్వహించడమంటే ఒక మహాయజ్ఞం చేయడమంతపని. ఈ మహాక్రతువులో ప్రజలు ఉద్రిక్తులయ్యే ప్రమాదం వున్నది కాబట్టి అనేక రకాల నేరాలకు అవకాశం ఏర్పడుతుంది. వీటిని అదుపులో పెట్టడానికి పలువిధాల చట్టబద్ధమైన చర్యలు తీసుకోవలసివుంటుంది. ఒక వ్యక్తిబదులు మరో వ్యక్తి వోటుచేయడం నేరం. వోట్లకోసం ధనమో ఋణమో ముట్టచెప్పినట్లయితే, ఆ ఇచ్చినవారు శిక్షార్హులవుతారు. ప్రత్యర్థి విజయావకాశాలను దెబ్బతీసే తప్పుడు ప్రకటనలుచేయడం, కుల మత ప్రాతిపదికపై ప్రచారంచేయడం, మితిమీరి ఎన్నికలకు డబ్బు ఖర్చుపెట్టడం ఇవన్నీ నేరాలే. ప్రతి అభ్యర్థి పోటీలో తానెంత ధనం ఖర్చుపెట్టింది వివరాలను ప్రభుత్వానికి తెలియజేయాలని మన దేశంలో ఎన్నికల చట్టం శాసిస్తున్నది.

ఐదేళ్ళకొకసారి వచ్చే ఈ మహాయజ్ఞాన్ని దేశ ప్రజలు జయప్రదంగా పూర్తి చేశారు. క్రమ క్రమంగా అభ్యర్థుల విజయ వార్తలు బయటపడుతున్నవి. నెలాఖరులోపుగా అన్ని ఫలితాలూ తెలిసిపోతవి.




# రాష్ట్రపతి ఎన్నికపై ఊహాగానాలు

శ్రీకృష్ణ

మద్రాసులో శ్రీ టి టి కృష్ణమాచారి ఎన్నిక ఇక్కడ సంచలనానికి కారణమైంది. సోషలిస్టు వ్యవస్థను, శ్రేయోరాజ్యాన్ని స్థాపించడానికి ప్రభుత్వం అనుసరిస్తున్న ఆర్థికవిధానాలకు ప్రజల మద్దతు బాగా ఉన్నట్లు ఇది రుజువుచేస్తోందని అంటున్నారు ఇది సబబేననడానికి ఆధారాలు లేకపోలేదు



సుమారు రెండు లక్షల ఓట్ల మెజారిటీతో గెలిచిన ప్రధానమంత్రి



సుమారు లక్ష ఓట్ల మెజారిటీతో గెలిచిన విద్యామంత్రి

శ్రీ కృష్ణమాచారి ఎన్నిక కాకుండా చేయడానికి కొందరు పారిశ్రామికులు ప్రయత్నించారన్నది రహస్యం కాదు అయన ప్రత్యర్థులలో ఒకరిని వారు సమర్థించారు కమ్యూనిస్టులుకూడా, ఆయన తమ సిద్ధాంతాలను తమవద్దనుంచే దొంగిలించారని ఆయనపై అక్కసుగా ఉన్నారు. ఆయన బ్రాహ్మణుడుగనుక బ్రాహ్మణేతరులు ఆయన్ని ద్వేషించారు కొందరు బ్రాహ్మణులు ఆయన తమ కులవాదాన్ని సమర్థించలేదని ద్వేషించారు అయినప్పటికీ చివరికాయన గెలుపు సాధించారు కొస్తా కూస్తా మెజారిటీ కాక మంచి మెజారిటీతోనే గెలిచారు. భారత ఆర్థిక వ్యవస్థ ఒడుదుడుకులు లేకుండా, క్రమబద్ధంగా అభివృద్ధికావాలంటే ఆయన గెలవాల్సిందేనని పట్టుదలతో ఆయన్ని ప్రజలు గెలిపించినట్లున్నది కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలో తక్కువజీతాలతో పనిచేసే ఉద్యోగులకు ఆయన గెలుపు ఆశాజనకం దేశమంతటా ఒకే కనీసవేతనం ఇప్పిస్తానని ఆయన వాగ్దానంచేశారు మాట నిలబెట్టుకునే మనిషిగనక, తక్కువతరగతి ఉద్యోగులు ఆయన మాట నమ్మవచ్చు.

మౌలానా ఆజాద్ కూడా తమ గుర్‌గాం నియోజకవర్గంనుంచి దాదాపు లక్ష ఓట్ల పెద్ద మెజారిటీతో గెలిచారు మతవాదాన్ని తోసివేసి మతాతీత వాదాన్నే ప్రజలు వరించారనడానికి మౌలానాగెలుపే నిదర్శనం ఆయన ప్రత్యర్థి అయిన జనసంఘీయుడు ఇంటింటికీ వెళ్ళి ప్రచారం చేసుకున్నారుగాని ప్రజలు మౌలానా ఆజాద్‌నే వరించారు

ఢిల్లీలో కూడా కాంగ్రెసు సంపూర్ణ విజయం సాధించింది. కాంగ్రెసు అభ్యర్థులైదుగురినీ ఢిల్లీప్రజ లెన్నుకున్నారు శ్రీమతి కృపలానికంటే మిగతావారి కందరికీ

(47-వ పేజీ చూడండి)

వచ్చే నెలాఖరుకుగాని, ఆపై నెల మొదటి వారంలోగాని రాష్ట్రాలలోనూ, కేంద్రంలోనూ కొత్త మంత్రివర్గాలు ఏర్పాటవుతవి రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి పదవులకు కొత్త ఎన్నికలు జరుగుతవి

ప్రస్తుతం పూర్తి అయిన ఎన్నికలలో దేశంలోవున్న దాదాపు పంధొమ్మిదిన్నర కోట్లమంది వోటర్లలోనూ ఎంతమంది తమ హక్కును వినియోగించినట్లు కనబడదు. 1952 ఎన్నికలలో నూటికి అరవై వంతుల మందికంటే ఎక్కువగానే వోట్లు వేశారు ఈసారి అంతమంది వోటుచేసి వుండరేమో ననిపిస్తుంది ఈ లెక్కలు ఉత్తరోత్తరాగాని పూర్తిగా తెలియవు సోవియెట్ రష్యాలో దాదాపు నూటికి 99 వంతులమంది వోటు చేస్తారు అమెరికాలోనూటికి 60 వంతులకు ఎప్పుడూ తగ్గదు ఇంగ్లండు, ఫ్రాన్సుల లోనూ అంతే మనం కూడా ఆ స్థితికి రావాలి. స్విట్జర్లెండు, స్పెయిన్, అర్జెంటినా, న్యూజీలెండు, హాలెండు, బెల్జియం మొదలైన కొన్ని దేశాలలో, ప్రతి వోటరూ విధిగా వోటు వేసితీరాలనే నిర్బంధ విధానం అమలులోవున్నది వోటు హక్కు వినియోగించకపోతే శిక్షకుపాత్రు లవుతారు ఏ విధమైన నిర్బంధ విధానానికీ అవకాశం లేకుండానే, మనం ఆ స్థాయిని అందుకోన గలిగితే, ప్రజాస్వామ్య పరిపాలనావిధానానికి మనదేశంలో బలీయమైన పునాదులువేసి, సుస్థిరత్వం చేకూర్చినవాళ్ల మవుతాము. ★

# బుడుగు



## చిచ్చుల పిడుగు

మా రాధా, గోపాళం, బామ్మా, మరేమో బాబాయీ వీళ్లందరూ నన్ను ఎలాగేనా బళ్లో పెట్టెయ్యాలని చూస్తున్నారు.

ఇలాని బాబాయి చెప్పాడులే.

మన్ని బళ్లో పెట్టేస్తే మన తెలివితేటలు అన్నీ పోతాయిట.

ఇలా అంటే నాకు తెలీదు కాని బాబాయి చెప్పాడనుకో.

అందుకని తెలివితేటలు అయిపోకుండా నేను కుంచెంమందిని రక్షించాలనుకున్నాను.

యెందుకంటే నన్ను కుంచెం బోల్డు ఛాలామంది సలహాలు అడుగుతున్నారు.

సలహాలు అంటే కోతలుట. ఇలానికూడా బాబాయే చెప్పాడు. కోతలు అంటే నాకు తెలీదుట.

ఇప్పుడు నాకు ఉత్తరాలు రాశారు కాబట్టి సలహాలు చెప్తాను. మనదగ్గిర లేకపోయినా సరే ఇవి మనం ఇవ్వాలిట.

ఇదిగో ఓ కుర్రాడు పాపం ఉత్తరం రాశాడు చూడు.

బడుగూ, మరేమోనేం మా అమ్మావాళ్లూ రోజూ నన్ను బళ్లోకి వెళ్ళమంటున్నారు. లాపోతే కొట్టుతాను అంటున్నారు. ఎలాగ?

ముందస్తుగా నాకు కోపం వస్తుంది. ఎందుకంటే వీడు నన్ను అనుమానం చేస్తున్నాడుకదా. నాపేరు బుడుగు అయినా వీడు బడుగు అని ఎందుకు రాయాలీ. అందుకే.

అయినా వాడి ఖష్టాలు చూస్తే జాలి వేస్తోందిగదా మనకి.

అసలు నీ చిన్నప్పటినించీ, మీ తాతయ్య చిన్నప్పటినించీ చిన్నపిల్లలు యెప్పుడూ ఇలా కష్టపడుతునే ఉన్నారు. అందరు చిన్నపిల్లలినీ ఇలా బళ్లో పెట్టెయ్యడమే.

పోనీ యేదో ప్రదిరోజులికి ఒకసారి వెళ్లితే చాలదుట. రోఝూ వెళ్ళాలిట.

మళ్ళీ యీ పెద్దవాళ్లందరూ చిన్నప్పుడు ఇలా కష్టపడినవాళ్లే. అయినా పెద్దయ్యాక ఇప్పుడు చిన్న చిన్న పిల్లలిని బళ్లో పెరేస్తున్నారు.





"నీళోసు కుంటునపుడు....

అంతెందుకులే. పాపం నన్ను కూడా రేపో మూడ్రోలుకో బళ్లో పెట్టాలని చూస్తున్నారుగదా.

నన్నేం చెయ్యలేరనుకో.

అయినా చిన్నవాళ్ళూ చితక వాళ్ళూ బళ్లో కెళ్లకుండా ఉండడానికని కొన్ని సంగతులు చెప్తాను.

ఒకటి: జెరంవచ్చిందని చెప్పాలి. మనం చెప్తే నమ్మరుగదా. అందికని యేం చెయ్యాలంటే, ముందస్తుగా చొక్కా యిప్పేసుకోవాలి. అప్పుడేమో ఎండలో నిలబడాలి ఛాలాసేపు. అప్పుడు వీపుమీద, పొట్టమీద జెరం వచ్చేస్తుంది.

అప్పుడు పరిగేతుకుని అమ్మదగ్గరికి వెళ్ళాలి. ఆ మ్మాయి జెరం జెరం గబగబా చూడూ, బళ్లోకి వెళ్లద్దని చెప్పూ అని చెప్పాలన్న మాట.

ఇంకోటి. జెరం రాగానే పరిగేతుకెళ్ళి చెప్పాలి తెలుసా.

లాపోతే, జెరం చల్లారిపోతుంది.

ఉంకోటి కూడాను. ఇలాంటి దానికి అసలు బామ్మ మంచిది. బామ్మకి చెపేస్తె చాలు. అప్పుడు అదే అమ్మకి చెప్తుంది.

రెండు : కుంచెంమంది పిల్లలు కడుపునొప్పి అని అంటారుకాని అది మంచిది కాదులే. రెండుసార్లో, ఫదిసార్లో అయాకా, అమ్మవాళ్ళూ కారప్పూసా పకోడీలు చేసుకుని మనికి పెట్టకుండా తినేస్తారు.

యిప్పుడు లేదుగదే అమ్మా అని చెప్పినా సరే పెట్టరు. ఇప్పుడు లేకపోతే రేపొప్పుది రోలుకో వస్తుందిగా అందుకని వద్దూ అని అంటారు.

అందికని, తలనొప్పి అన్నింటికన్నా మంచిది. ముందస్తుగా అమ్మ నమ్మదు అనుకో. అయినా సరే మనం తలనొప్పి తలనొప్పి అని ఫదిసార్లో వందసార్లో చెబితే కుంచెంనమ్మ








....సిగాన పెసూనాంబవస్తే ఎలా ?

# ★ బుడుగు! చిచ్చుల పిడుగు! ★

తారు. ఇదికూడా ముందస్తుగా బామ్మకే చెప్పాలి. అమ్మకి చెప్పితే లాబంలేదు.

అసలు ఏం చేసినా లాబంలేదు. ఎలాగేనా బళ్ళోకి వెళ్ళాలిలే. అందుకని కుంచెం ఎలాగో చాలా కష్టపడి రోఝూ బళ్ళోకే పోవడం మంచిది. గబగబా గబగబా చదివి పారేస్తె ఘుబుక్కుని పెద్దాళ్ళయిపోతాంగా. అప్పుడు ఇంచక్కా ఎప్పుడూ బడి మానెయొచ్చు.

యింకోటి, మా బాబాయంత పెద్ద వాళ్లు అయ్యాకా, అసలు ఇంక బళ్ళోకి వెళ్లద్దంటారులే.

మా బాబాయి అంతేగా బళ్ళోకి వెళ్తాను వెళ్ళాను అంటాడు. బామ్మా, నాన్న, యింక చాల్లే, ఆఫీసుకి వెళ్లిపో అంటారు. అదన్నమాట.

ఈ పెద్ద వాళ్ళెపుడూ యింతే. మనం వెళ్తాం అంటే వద్దూ అని అంటారు. మనం వెళ్లను ఒద్దూ అంటే. వెళ్లూ వెళ్లూ బళ్లోకెళ్లు బడిదొంగా బజారు గద్దా అంటారు. యెలాగ?

ఇంకో ఉత్తరం చూడు. వీడు కుంచెం పెద్ద కుర్రాడిలా వున్నాడు.

వురెయ్ వురేయి బుడుగూ మరేమోనూ మా అమ్మా నాన్నా నాకు డబ్బులు అసలు ఈటం లేదూ ఎలాగరా మరీ అని రాశాడు గదా.

ఇది కూడా చాలా కష్టమే. అసలు డబ్బులు అంటే చాలామందికి చాలా యిష్టంట. నాక్కూడా కొంచెం యిష్టమే ననుకో.

కాని ఏంచేస్తాం. చిన్న పిల్లలికీ, కాలేజీకి వెళ్లే బాబాయిలకే డబ్బులు చాలా యివ్వరు. అడిగినా సరే.

కాని అబద్ధం చెప్తె చాలా డబ్బులు ఇస్తారుట. బాబాయి యిలాగే చేస్తాడుట.

మళ్ళీ నేమో, నాన్నకి అమ్మ డబ్బులు ఇవ్వదు కదా. ఎందుకూ అంటుంది. అప్పుడు నాన్న కుంచెం అబద్దాలు చెప్పతాడుట.

చిన్న పిల్లలు మాత్రం అబద్దం చెప్పకూడదుట. చెప్పితే కొట్టుతారు.

కాని మనం నిజెం చెప్పతాను అంటే కొంచెంమంది పెద్దవాళ్లు డబ్బు లిస్తారులే.

ఇప్పుడు మాలావుపాటి పక్కింటి పిన్నిగారి ముగుడు లేడూ. వాడేం బీడీలు కాలుస్తాడులే.

బీడీలు కాలచడం తప్పకదా. ఊరికే జెటకా తోలడానికి దాచుకోవాలి అంతే. కాని వీడు నిజెంగా కాలి చేస్తాడుగదా. లావుపాటి పక్కింటి పిన్నిగారు వాడికి చెప్పిందిలే వురెయ్ ముగుడూ అలా బీడీలు కాలచకూడదూ అని.

అయినా వాడు మా యింటికి వచ్చి నాన దగ్గిర కూచుని కాలుచుతాడు గదా.

అప్పుడేమో నేను వురేయ్ వురేయ్‌నీ సంగతి చెప్పతా ఉండూ అని అంటాను గదా. వాడు ఘుబుకుని నన్ను ముద్దుపెతేసుకుని ఓ కాణీయొప్పదిణాలో యిచ్చేసి చెప్పకమ్మా బుడుగు తప్పమ్మా ఒద్దమ్మా యిలాని ఏడుచుతాడు.

అప్పుడు నేనేమో పోనీలే అని, యేవండీ లావుపాటి పక్కింటి పిన్నిగారూ మరేమోనూ, మీపిన్నిగారు ముగుడేమో మానాన్నతో కలిసి బీడీలు కాలచ లేదండీ అని అబద్దాలు చేపేస్తాను.

ఏవిటో నేను యెప్పుడు ఇలా అందరినీ రక్షించుతానులే.

ఇలాగ కూడా మనం డబ్బులు తెచ్చుకోవచ్చును.

నాకు ఇప్పుడు ఛాలా బోలుడబ్బులు కావాలనుకో. ఒక పుస్తకం రాసిస్తే వస్తాయిట. బాబాయి చెప్పాడులే. నేను ఓటి రాస్తున్నాను.

నీకూ డబ్బులు కావలిస్తే నువ్వొప్పుది పుస్తకాలు రాసెయ్యి.

పుస్తకాలు రాసెయ్యి అంటే నాకు తెలీదు. అయినా సరే మనం రాసెయ్యొచ్చు. డబ్బులు కావాలి కదా మరి.

డబ్బులు చాలా ఉంటే, మనం సీగాన పెసునాంబని సినిమాకి తీసి కెళ్ళొచ్చును. నేను అలాగే తీసికెళ్లుతాను సీగాన పెసునాంబని

రేపో మూడ్రోలుకోయేమయిందితెలుసా?

నేను గడియారస్తంబందగ్గిరికి వెళ్ళాను.

అక్కడ జెటకాలుఉన్నాయికదా. మాయింటికిరాపోయి అనిపిలిచాను. వాళ్లు నేనురానుబాబుఅని చెప్పారు. నేనంటే బయంలే.

యెలాగ? అప్పుడు ఉంకోచివరలో జెటకాఉందిగదా. జెటకాబండీవాడు లేడు. నేనే ఆజెటకాఎక్కిపోయి కొరడాపట్టుకుని ఛెల్‌మన్నాను.

జెటకా ఝూంమని పరుగెత్తిపోయింది. నాకుబయంవేసిందిలే కుంచెం. అంతట్లోకే నిజెంబండివాడూ ఉంకోపోలీసువాడూ బండీనిఆపేసి లాక్కొన్నారు.

మనం కుర్రాళ్లం అనికదా.

అందుకని నువ్వెప్పుడేనా జెటకా తోలాలనివుంటే, మానానకోటు తొడుకొని, మానానకళ్ళజోడు పెట్టుకొని వెళ్లాలి. లాపోతే నిన్ను కూడా పోలీసువాడూ, నిజెం జెటకావాడూ పట్టుకుంటూరు.

బురుగూమరీ, మనం నీల్లోసుకుంతున్నపురూ, సీగానపెసూనాంబవత్తే ఎలాగఅని అడుగుతున్నారు ఉంకోకుర్రాడు.

ఛాలాఖష్టం. అందికే మనం రోజూ నీల్లోసుకోకూడదని నాలాంటి వాళ్లు చెప్తున్నారు.

కాని పెద్దవాళ్లు మన్ని పెంచుతాను అంటూరుగా అందికని అసయ్యంగా రోజూ నీల్లోసుకోమని అంటూరు.

ఏంచెయ్యాలంటే, నువురావద్దులేఅమ్మా నేనేపోసుకుంటాను నీళ్లాఅనిచెప్పేసెయ్యాలి ముందస్తుగా.

అప్పుడేమో నీళ్లుగది తలుపేసేసి, సబ్బుని తడిపి అరగతీసెయ్యి. కాసేపు ఉత్తి నేకూచో తరవాత కుంచెం నీళ్లు నెత్తిమీదజల్లుకోవాలి. ఏంచేస్తాంమరి. అప్పుడు డేగిసాలోనీళ్లుఅన్నీ పారపోసేసి హమ్మయ్యఅని ఇంటిలోకి వెళ్లాలి.

అయిసుఫ్రూటు కొనుక్కోడం ఎలాగ బుడుగూఅని ఉంకోఉత్తరం వచ్చింది.

ఏమిటంటే ముందస్తుగా అమ్మమాడకండా వాడినిపిలిచి అయిసుఫ్రూటులు రెండుయిమ్మని ఎంగిలిచేసెయ్యాలి. అప్పుడు అమ్మకుచెప్తె ఇంచక్కా కొని పెట్టుతుంది.

తరవాత కుంచెంసేపు పెర్రివేటుచేప్పేస్తుందనుకో.

ఈ పెరపెంచకంలో, ప్రెవేటు లేకుండా మనికి యేంరాదుగదామరి.

(ఇంకుంచెం ఉందిలే.)




"నేను చెప్పిన దానిలో శాస్త్రవిరుద్ధంగా ఎక్కడ వుంది?" అని ప్రశ్నించాడు పాండ్య.

"లేదు అదీ శాస్త్రవిహితమే—అయితే, అది తప్పు పద్ధతి. మనమే కత్తి దూయటం ప్రమాదం. రక్షణకూడా మనమే ఏర్పరచుకోవాలి. ఈ అభియోగంలో మనం ఓడిపోవచ్చు. నేను ఎక్కడా ఇటువంటి నిదర్శనంవున్నట్లు వినలేదు. మనం అవలంబించాలనుకునే యుక్తి తప్పుమార్గమని నా అభిప్రాయం."

"కాని యుక్తి ఫలితం మాత్రం తప్పు కాదు."

"ఇటువంటి పరిస్థితులలో మనం సంప్రదాయ సిద్ధంగా అనుసరించే విధానం ఒకటి వుండనేవుంది. దానికి భిన్నంగా ప్రవర్తించటంనాకు మనస్కరించటంలేదు. ఇది ఆత్మహత్యే అయివుంటుంది. సరైన సమయంలో మన అభిప్రాయాన్ని స్పష్టీకరిస్తే చాలు. మనకు ఏలాటి ప్రమాదం రాదు. కాదని రుజువు పరుచుకోవలసిన బాధ్యత చంద్రశేఖర్ భార్యమీదే వుంటుంది. నేను చెప్పదలచుకున్న విషయం ఇదే. మనమే ఇతరుల మీద ఒక నేరం ఆరోపించి, దానిని నిరూపించుకోవలసిన బాధ్యతను మనపైనే పెట్టుకోవటం నాకు ఇష్టంలేదు."

"అయితే మీరు ఆమెకు వ్యతిరేకంగా ఎలాంటి చర్యా తీసుకోరా?"

"పాండ్య! ఇప్పుడే కాదు. తర్వాత అవసరమైతే చూద్దాము. ఇటువంటివ్యవహారాల్లో చిక్కుకోవటం, నా మనస్తత్వానికి విరుద్ధమైనపని. ఏదిఎట్లా వున్నప్పటికీ, ఇంతవరకు మనం ఏలాటి అనాలోచితమైనపనీ చేయలేదు."

"అయితే, ఏం చేయాలని నా ప్రశ్న?"

"మన మామూలుపద్ధతిని అవలంబించాలి. మొదట ఆమె బయటికిరావాలి. డాక్టరు చంద్రశేఖర్ ప్రమాదంవల్ల మరణించినట్టు రుజువుకానందుచేత కంపెనీ పరిహారం ఇవ్వనవసరంలేదని చెపుతాను. పరిహారంకోసం ఆమె దావా వేసేటట్టు చేస్తాను. ఆమె దావా వేసినపుడు, మనం చేయవలసిన ఆలోచనలేమిటో అప్పుడే చూసుకుందాము."

"అప్పుడు మనం మునిగిపోతాం."

"కావచ్చు. కాని నేను చేయదలచుకున్నది అంతే."

"మనం మునిగిపోతామని మీకు ఎట్లా తెలిసింది?"

**తుమ్మలపల్లి సీతారామారావు**

"ఇక్కడికి రావటానికి ముందు పోలీసు అధికారితో మాట్లాడాను. మేము సరిగా ఇదే విషయాన్ని చర్చించాము. నాకు ఇది హత్యేమోనని అనుమానంగా వుందని చెప్పాను. ఆయనకూడా తనకు అదే అభిప్రాయం మొదట వున్నట్టు తెలియపరిచాడు. కాని తరువాత, ఆయన అభిప్రాయం మారిందట. వాళ్లు విచారణ మొదలు పెట్టారు. హత్యలు నిరూపణచేయటం, హంతకులను అన్వేషించటం మొదలైన విషయాలనుగురించి వాళ్ల దగ్గరకూడా కొన్ని పుస్తకాలున్నవి. ఎలా హత్యలు చేస్తారో, ఎలా హత్యలు చేయరో ఆ పుస్తకాలలో వుంటుంది. మెల్లిగావెడుతున్న రైలు చివరపెట్టెవెనుక వున్న ఒక మనిషిని క్రిందికిత్రోసి ఎలా హత్య చేయగలిగారని వాళ్లే తికమక పడుతున్నారు. ఇటువంటి పరిస్థితిలో హత్య జరగటాన్ని గురించి ఇంతకుపూర్వ మెప్పుడూ తాము వినలేదన్నారు. వాళ్లుకూడా నీవు చెప్పిన అభిప్రాయమే వెల్లడించారు. హంతకుడు ఒకడు వున్నాడని ఊహించినప్పటికీ, మెల్లిగా వెడుతున్న రైలు వెనుకభాగం నుంచి క్రిందికి తోయటంవల్ల అతడు మరణిస్తాడన్న ధైర్యమేమిటి? అదీగాక హత్యచేసేప్పుడు హంతకుడు అక్కడ వుండటానికి స్థలమేది?"

"ఆ రైల్లో ప్రయాణంచేసిన వాళ్లనెవరినైనా పోలీసుఅధికారులు విచారించారా? ఆ రైలుపెట్టెలో ప్రయాణం చేస్తున్న వాళ్ళలో ఎవరైనా డాక్టరు చంద్రశేఖర్ భార్యను ఎరుగున్నవాళ్ళు వున్నారేమో పోలీసులు ఆచూకీతీశారా?

"ఈ విషయం విచారించకుండా పో

# అపరబుద్ధి

కులు వొదిలిపెట్టారని మీరు అనుకోవద్దు. ఆ రైల్లో ఇంకొకరు కూడా ఉన్నారు.

"అంతకంటే ఎక్కువ లోతుగానే విచారణ చేశారు. రైలుస్టేషన్‌లో పైతరగతి పెట్టెలకు సీట్లు రిజర్వుచేసి, పెట్టెలమీద ప్రయాణీకుల పేర్లు, చిరునామాలు, వాళ్ళు చేరవలసిన గమ్యస్థానాల పేర్లూ వ్రాసే ఇన్‌స్పెక్టర్‌నువిచారించారట. డాక్టరు చంద్రశేఖర్ ఎక్కిన పెట్టెలో మొదటిసీటులో గుమ్మందగ్గరగా కైలాసనాథ్ అనే వ్యాపారస్తుడు వున్నాడట. అతడి ప్రక్కసీటులో డాక్టరు చంద్రశేఖర్ కూర్చున్నాడని చెప్పారు. పోలీసు సి.ఐ.డి. రైలు కదలటానికి పదినిమిషాలక్రితం అవతల ప్లాటుఫారంమీద నిలుచుని చంద్రశేఖర్ కోలకర్రల సహాయంతో రైలుపెట్టెలో ఎక్కటం చూచినట్టు తెలిపాడట. చంద్రశేఖర్ టిక్కెట్టుకోసం సామాన్లు వున్నచోట తన



కాగితాల సంచివుందేమో నని దాన్ని తెచ్చుకోటానికని ఆ పెట్టెదాటి చివరవున్న సామాన్ల పెట్టెలోకి వెళ్ళినట్టు ఆతరువాత అతడు కనపడనట్టు కైలాసనాథ్ పోలీసు అధికారికి తెలిపినట్టుగా ఆయన నాతో చెప్పాడు. ఇంకేంవుంది! పర్యవసానం స్పష్టపడటం లేదూ?"

"సరే ఇంకేం! డాక్టరు చంద్రశేఖర్ భార్యకి పరిహారం యాభైవేలు ఇచ్చివేయండి."

"పాండ్యా, ఒక్క నిముషం నిదానించు. నేను ఇట్లా అనుకున్నాను. పోలీసు అధికారులు ఇదే అభిప్రాయంలో వున్నారు. ఇది ఆత్మహత్య అని నిరూపించటానికి మనకు ఇంకేమైనా ఆధారం వుందా?"

"ఏం లేదు."

"పాండ్యా, ఆధారం ఉందనే నా గట్టి అభిప్రాయం. సరే. మనమే అభియోగం తీసుకునివద్దాం. పంచాయతీదారులు నిర్ధారణ చేస్తారు. నా అభిప్రాయం పొరపాటు కావచ్చు. పోలీసు అధికారులు సేకరించిన వివరాలు సరైననిర్ణయానికి తోడ్పడక పోవచ్చు. ఈ కేసు విచారణకు రావటానికి ముందుగానే, మనం సిద్ధపడి వుండాలి. పంచాయతీదారుల నిర్ణయమే మనకు తుది తీర్పు. మనం పరిహారం ఇవ్వవలసివస్తే సంతోషంగా ఇచ్చేద్దాము. కాని ఆమెకు యాభైవేల రూపాయలు బహుమానంలాగా ఇప్పుడు సమర్పించను."

"అది ఆత్మహత్య అని మనం ఆరోపణ చేస్తే, మీరు చేయాలనుకున్న పని ఇక్కడే చేయవలసి వస్తుంది."

"సరే! నీ వేచూస్తావుగా."

మేనేజింగ్ డైరెక్టరు లేచి తన ఆఫీసు గదిలోకి వెళ్ళిపోయాడు. పాండ్యతో కలిసి నేను కూడా రికార్డు గదిలోకి వెళ్ళాను. అక్కడ ఆయన స్విచ్ వేశాడు. లైట్లు వెలిగినవి.

"కృష్ణమోహన్! నా అనుభవంలో ఇలాంటివి వందలకొద్ది కేసులు పరిష్కారం చేశాను. చూడు ఆయనకే యదార్థస్థితి తెలిసి వస్తుంది. అసలు విషయం ఎలా తెలుస్తుందో నీకే కూడా తెలియదు. ఇది ముమ్మాటికి హత్యే! ఇందులో సందేహంలేదు. వాళ్లు రైల్వే కూలీని విచారించలేదు...ఎవ్వరూ కనుక్కోలేదు. బయటినుంచి ఎవరో ఒకరు అనుమానానికి రాకూడదు!...అయినా వాళ్లకి ఎలా తెలుస్తుందిలే!"

పాండ్య మాట్లాడటం నిలిపి నా ముఖంలోకి చూశాడు. కొంతంసేపు మౌనంగా ఉన్నాడు...మళ్లీ పిచ్చివాడి ధోరణిలో మాట్లాడటం ప్రారంభించాడు:

"నేను ఆయనతో చెప్పలేదు? మనం మొదటే ఆమెమీద నేరారోపణ చేయాలి. విచారణవరకు ఆగకుండా, ఆమెను వెంటనే ఖైదు చేయించాలని నేను చెప్పలేదు?"

"ఏమిటి మీ అభిప్రాయం?" అన్నాను, గట్టిగా కొట్టుకుంటూన్న గుండెలమీద చేతితో నొక్కుకుంటూ.

"అసలు అతను రైల్లోనే ఎక్కలేదు!"

పాండ్య పెద్ద గొంతుతో ఘట్టిగా మాట్లాడుతున్నాడు.

"డాక్టరు చంద్రశేఖర్ రైల్లో ఎక్కనే లేదు. ఎవరో అతని దుస్తులు వేసుకుని, కోలకర్రలు తీసుకుని కాలు విరిగిన వాడివలె రైల్లో ఎక్కి ప్రయాణం చేశాడు. హంతకుడు ఎవరో ఎవరికీ తెలియదు. అతడు హత్య జరగవలసిన ప్రదేశంలోనే వుండి వుంటాడు. మనకు అనుకూలంకాని సాక్ష్యాలు, వివరాలు, వాఙ్మూలాలు, పోలీసు అధికారులు సేకరించారు. ప్రయాణం చేసిన వ్యక్తి గుర్తులు నాకు తెలిసినై."

"ఏమిటవి?" అన్నాను ఆశ్చర్యాన్ని కనపరచకుండా.

విచారణకు ఈ గుర్తులు చాలా ముఖ్యం. అందువల్లనే మొదటినుంచీ నేను వీటివిషయమై జాగ్రత్తపడ్డాను. రైలుపెట్టెలో కూచున్నపుడు కూడా ఎవరూ స్పష్టంగా నాముఖం వైపు చూచి గుర్తించకుండా వుండటానికి, ఇతరుల దృష్టి నుంచి తప్పించుకొని తిరిగాను. కోలకర్రలు, కట్టుకట్టిన కాలు, కంటి అద్దాలు, చుట్ట, వీటన్నిటికంటే ముఖ్యంగా సమయోచిత పరిజ్ఞానం మొదలైన హంగులన్నిటిలో ఎంతో జాగ్రత్తగా సిద్ధపడ్డాను.

"అయితే! విచారణలో ఎవరైనా సాక్షులు అతణ్ణి ఎలాపోల్చామని చెప్పారు? మూడు నాలుగు రోజులక్రితం, కటిక చీకటిలో కొద్ది నిమిషాల వ్యవధిలో జరిగింది ఈ సంఘటన. మరణించిన చంద్రశేఖర్ శవపరీక్ష చేసినడాక్టరు రిపోర్టును పరిశీలిస్తాడుఅధికారి. ఆతరువాత చంద్రశేఖర్ భార్యను ప్రశ్నిస్తారు. ఆయన ప్రమాదం వల్ల మరణించాడని చెపుతుంది అతని భార్య కోమలం. అందరూ ఒకేపాఠం వల్లిస్తారు. అప్పుడు అందరి దృష్టి మనవైపు మరలుతుంది. నా సలహా పాటించి మనకంపెనీ మేనేజింగ్ డైరెక్టరు కోమలం మీద మనకు అనుమానం వున్నదనీ, చంద్రశేఖర్ హత్యవల్ల మరణించాడనీ ధృవపడుతూన్నదని మనం అభియోగం తీసుకొనివస్తే, వాళ్ళ ఆటలు సాగవు. వారు తయారు చేసిన సాక్ష్యాలు, ఆనవాళ్లు పట్టామన్న గుర్తులు ఇట్టేగాలికి ఎగిరిపోతవి. పోలీసులు తమ అభిప్రాయం తప్పని గ్రహిస్తారు. మనకు అను

కూలమైన మార్గంలో కొంతవరకు ఈసంఘటనపై విచారణ సాగుతుంది. కాని ఇప్పుడు మన మేనేజింగ్ డైరెక్టరు, ఆమే ముందుగా ఫిర్యాదు చేసి దావా వేసే వరకు మనం వేచి వుండాలని చెపుతున్నాడు. సరే ఆయన ఆలోచనే సాగనీయండి. వాళ్ళు కనిపెట్టామని చెప్పే ఆనవాళ్లు, గుర్తులు, ఎంతవరకు ఉపయోగిస్తయో చూద్దాము. ఆయన ఆలోచన వల్ల ప్రయోజనం వుండదు. తెలివిగల న్యాయవాది సాక్షులు చెప్పే గుర్తులను, ఆనవాళ్ళను, క్షణంలో అర్థంలేని కట్టుకథలుగా నిరూపించి వేస్తాడు. అప్పుడు కథ అడ్డం తిరుగుతుంది. సంప్రదాయాన్ని అంటిపెట్టుకుని వ్యవహరించటంవల్ల జరిగేది అంతే. పూర్వపు మేనేజింగ్ డైరెక్టరైతే, అతురాలనే చెప్పినవిధంగా చేసేవాడు, కృష్ణమోహన్! ఆయన తండ్రి అయితే ఈ పరిస్థితిలో ఆమె చేత ఈపాటికి ఒప్పించేవాడు. నేరస్థురాలిగా ఆమెను నిరూపించటానికి తగిన బలీయమైన ఆధారాలు సమకూర్చేవాడు. కాని ఇప్పుడు మన పరిస్థితి ఆలోచించు. మనం ఎటువంటి చిక్కులో పడిపోయినామో చూడు! అసలు ఈ సంఘటనకు సంబంధించిన కీలకాన్ని మనం వొదిలిపెట్టాము. మన వాదానికి బలహీనతకలిగింది. మనం గెలవం! ఈ పద్ధతిలో కంపెనీని నిర్వహిస్తే, మనం మునిగిపోవటానికి ఎంతో కాలంపట్టదు. ఇలా దెబ్బమీదదెబ్బ రెండు మూడు తగిలితే, మన కంపెనీని ఎత్తేయాలి. అవసరమైన సమయంలో మనం యెటిచర్యా తీసుకోకుండా మౌనంగా కూచుంటే, మన మౌనానికి ప్రతిఫలం అనుభవించవలసిందే. యాభైవేల రూపాయలు సమర్పించుకోనక తప్పదు. ఇది శుద్ధ అవివేకమైన పద్ధతి.”

దీపాల కాంతి మా కళ్ళలో ప్రకాశిస్తుంది. మేనేజింగ్ డైరెక్టరు బోల్తాపడ్డాడు అన్నాడు పాండ్యా. ఆయన విపరీతమైన ఆవేశంతో మళ్ళీ మాట్లాడటం మొదలుపెట్టాడు. హత్యచేసినవాడు కారులోవచ్చి హత్య జరిగిన ప్రదేశానికి సమీపంలో కారును నిలిపి వుంటాడు. కోమలం, అతడుకూడా వేరొక కారులో రావటం, తరువాత శవాన్ని ఒక కారులో తీసుకునిరావటం, అటుపిమ్మట ఇద్దరూ వేరొక కారులో వెళ్ళటం జరిగిందని సి. ఐ. డి. ఉద్యోగి చెప్పాడట. ఆ ఉద్యోగి ఆమెను చూసినట్టుగా తెలిపాడట. ఆమె హోటల్ లోకి వెళ్ళిందనే సంగతికూడ ఆయన గమనించినట్టు తెలుస్తుంది. కాని హత్యవిషయంలో ఆయనకుకలిగిన అభిప్రాయం సరైనదికాదు. ఆయన చెబుతున్న విషయాలు దాదాపు యదార్థస్థితికి దగ్గరలోనే ఉన్నై. నా శరీరం కంపిస్తూంది. నాలో తొట్రుపాటు కనపడకుండా ధైరం తెచ్చుకునిమౌనంగా పాండ్యచెప్పేమాటలు వింటున్నాను.

“అయితే ఇప్పుడు మీరు ఏంచేస్తారు?” అని ప్రశ్నించాను.

“సరే. మొదట ఆమె బయటికి వచ్చి కంపెనీమీద దావావేసేవరకు మనం వేచి వుండాలని మన మేనేజింగ్ డైరెక్టరు అంటున్నాడు. అదీ ఒకవిధంగా అనుకూలంగానే వుంది. మొదట డాక్టరు చంద్రశేఖర్ ఎందుకు ఆత్మహత్య చేసుకున్నాడు అనే విషయం నిరూపణకావాలి. మనకు ఈ నిరూపణకూడా అనుకూలమైనదే. తరువాత ఆమె విషయమై సమగ్రమైన విచారణజరగాలి. ఆమె వ్యవహారాలు, ఆమె చేసే పనులు, ఆమె పరిచయస్థులు, వారితో ఆమెకు జరిగే లావాదేవీలు మొదలైన విషయాలన్నీ పరిశీలించటంవల్ల మనకు యదార్థస్థితి వెల్లడి అవుతుంది. అప్పుడైనా ఈ సంఘటనకు సూత్రధారి ఎవరో బయటపడుతుంది, కృష్ణమోహన్! అతడెవరో? ఆమె తప్పక అతణ్ణి కలిసితీరుతుంది. నాకు ఆ విషయం తెలియాలి. అటు తరువాత అన్నీ నీకే తెలుస్తై. ఆమె దావా వేయాలి. బోనులోకి వచ్చి సాక్ష్యం చెప్పాలి. ఆమె చెప్పే విషయాలు విని మేనేజింగ్ డైరెక్టరు ఉక్కిరిబిక్కిరి అవుతాడు. నేను చెప్పిన సలహాఔచిత్యం ఆయనకు అప్పుడు అర్థమౌతుంది. చివరకు ఎలా జరుగుతుందో ఊహించలేకుండా వున్నాను,” అన్నాడు పాండ్యా.

* * *

పాండ్యా నన్నుకూడా దృష్టిలో వుంచుకున్నాడు. ఆ విషయం నేను తెలుసుకున్నాను. ఆమె దావావేస్తే, కోమలం బోనుఎక్కి తన వాఙ్మూలం చెప్పాలి. పోలీసు అధికారులు ఆమెను ప్రశ్నలు వేస్తారు. ఆమె ఉక్కిరిబిక్కిరి అవుతుంది. అప్పుడు పర్యవసానం ఎలా పరిణమించేదీ భగవంతుడికే తెలియాలి! ఆమె దావా వేయకపోతే, ఇంకా క్లిష్టమైన పరిస్థితులు ఏర్పడతై. చంద్రశేఖర్ భీమా పట్టా సొమ్ముకోసం కోమలం దావావేయకపోతే, ఈ విషయంలో పోలీసు అధికారులు జోక్యం కలిగించుకోవటం అవసరమౌతుంది. ఆమెను కలుసుకోటానికి నాకు ధైర్యం చాలటంలేదు. టెలిఫోన్‌లో ఆమెతో ఎవరైనా మాట్లాడితే ఆ విషయాలన్నీ తెలుసుకోటానికి టెలిఫోను శాఖలో ఏర్పాట్లు జరిగినవనే సంగతి నాకు తెలుసు. అందువల్ల ఆమెతో టెలిఫోనులో మాట్లాడటం కూడా ప్రమాదమే. గడచిన రెండు మూడు రోజులు గడిపినట్టుగానే, మనసులోని ఆందోళన బయటపడకుండా సంచరిస్తూ, విచారణఫలితం తెలుసుకోటానికి ఆదుర్దాగా ఎదురుచూస్తున్నాను. నాకు కాళ్ళలో బలహీనత ఏర్పడింది. ఏవో రైళ్లు పరుగెత్తుతున్నట్టు శబ్దం చెవులలో గింగురుమంటూ వుంది. శూన్యంగా వున్న చీకటిలోకి కళ్లు పెగల్చుకుని చూశాను. ప్రశాంతంగా వున్న వాతావరణంలో, కారు చీకటి భయం కలిగిస్తూంది. నాకు కర్తవ్యం గోచరించటంలేదు. నిద్రపోదామని ప్రయత్నం చేశాను. కాని నిద్రపట్టలేదు. అన్నం సయించలేదు. గుండెకు ధైర్యం కలుగుతుందని జిన్ తీసుకుందామని ప్రయత్నం చేశాను. ఎప్పుడూ అలవాటైన జిన్, పెదిమలతో ముట్టుకోటానికైనా మనస్కరించలేదు! అన్నిటిమీద నాకు అయిష్టం కలిగింది. ఏ పనిలోనూ ఆసక్తి కనపడటంలేదు. నిరుత్సాహం నన్ను వేగంగా తిరుముకువస్తూంది!

ఆ మరునాటిరాత్రి, భోజనసమయానికి కొంచం ముందుగా కోమలం నా బంగళాకు వచ్చింది. నేను మేడమీద గదిలో మంచంమీద పడుకున్నాను. నౌకరు తనకు పని వున్నదని చెప్పి మామూలువేళకు కొంచం ముందే ఇంటికి వెళ్ళిపోయాడు. కోమలం నన్ను పిలిచింది. ఆమెకు జవాబు చెప్పటానికికూడా నాకు భయం వేసింది. కళ్ళు తెరిచి ఆమెవైపు చూశాను. ఆమె నా దగ్గరకు వచ్చి పక్కగా మంచంమీద కూచుంది.

 # అపరబుద్ధి 

"అక్కడినుంచి నీవు మొట్టమొదట ఎక్కడికి వెళ్ళావు? ఇంటికేనా?" అని అడిగాను.

"లేదు. హోటల్‌కి వెళ్ళాను," అంది.

"తరువాత?"

"కమలాక్షి ప్రవర్తన ఆరోజు కారోజు విచిత్రంగా మారుతూంది... ఇంట్లో వున్న టెలిఫోనులో బయటవాళ్ళని పిలవటానికి, ఇతరులెవరన్నా టెలిఫోనులో మాట్లాడినపుడు జవాబు చెప్పటానికి నాకు భయం వేస్తూంది. అందువల్లనే, మీతో స్వయంగా మాట్లాడవచ్చునని బయలుదేరి వచ్చాను."

"కమలాక్షి విషయం ఏమిటి?"

"అది అపస్మార వ్యాధివలె కనపడుతూంది. ఈ సంఘటన కమలాక్షికి అంతులేని అధైర్యం, భయం కలిగించింది."

"ఇంకేమీ విపరీతం కనపడడంలేదు?"

"ఊహు!"

"సరేత్వరగా చెప్పాలి. తరువాత?"

"తరువాత జరిగిన విషయాలు జ్ఞాపకం తెచ్చుకోవాలంటేనే, నాశరీరం కంపిస్తూంది! అంత్య క్రియలు పూర్తి అయేవరకు నేను ఇంటిదగ్గరే వుండాలి."

"ఇవాళేకదూ అంత్య క్రియలు జరుగవలసింది?"

"ఔను. శవ పంచాయతీ అయిన తరువాత"

"ఆ పైన—?"

"రేపు ఇనపపెట్టె తెరుస్తారు. అది అధికారుల ఎదుట జరగాలట. ఆయన రాబడి పన్ను చెల్లిస్తున్నాడు గనుక ఆయన ఆస్తిని ప్రభుత్వ ఉద్యోగులు బహిరంగంగా తెలుసుకోటానికి వాళ్ళ యాజమాన్యం క్రింద ఆ పెట్టె తెరుస్తారని నాకు తెలిసింది."

"సరే! డాక్టరు చంద్రశేఖర్ భీమాపట్టా కూడా ఇనుప పెట్టిలోనే వుందా?"

"ఔను! ఆయన మరణించటానికి వారం రోజుల క్రితం, నేనే ఇనపపెట్టిలో పెట్టాను."

"అధికారులు నీ ఇనపపెట్టెను తెరిచే సమయానికి నీ న్యాయవాదినికూడా అక్కడికి పిలిపించు. న్యాయ చట్టంలో, ఇటువంటి పరిశీలన న్యాయవాది సమక్షంలో జరుగాలని వుంది. ఆపట్టాపై నీకు హక్కు వున్నదని నీ న్యాయవాది చేత రాయించాలి. నీవు ఆపనిచేస్తేగాని, తరువాత జరుగవలసిన తతంగం ప్రారంభం కాదు."



"భీమా పట్టా ప్రతిఫలం పొందే హక్కు నాకు వుందని న్యాయవాదిచేత దరఖాస్తు రాయించాలికదూ?"

"ఔను. కోమలం, ఒక ముఖ్యమైన విషయం గుర్తుంచుకో. ఈ విషయం నీవు ఇప్పుడే న్యాయవాదికి చెప్పకూడదు. నీవు కోరే ప్రమాద భీమా పరిహారాన్ని కంపెనీవాళ్ళు నీకు ఇవ్వరు"

"ఏమిటి?"

"భీమాకంపెనీ నీకు పరిహారం ఇవ్వదు."

"వాళ్ళు ఇవ్వాలి కదూ.?"

"వాళ్ళు ఇది ఆత్మహత్య అనుకుంటున్నారు. నీవు పరిహారం కోసం కోర్టులో కంపెనీమీద దావా వేయాలి. వాళ్ళు ఇవ్వటానికి పూర్వం పంచాయతీదారుల తీర్పు నీకు అనుకూలం కావాలి. నీ న్యాయవాదికి ఈ సంగతి ఇప్పుడే చెప్పవద్దు. క్రమేణా ఆయనకే తెలుస్తుంది. అప్పుడు ఆయనే దావా వేయాలని నీతో చెబుతాడు. అంగీకరించు. అతనికి నీవు కొంత డబ్బు ఇవ్వాలి. ఇదొకటే మార్గం. కోమలం! ఇంకో విషయం వుంది."

"ఏమిటది?"

"నేను ఇకమీద నిన్ను కలుసుకోలేను."

"కాని నాకు మిమ్మల్ని కలుసుకోవాలని వుంటుంది."

"మనం ఒకరినొకరు కలుసుకో కూడదు. భీమా కంపెనీ అధికారులు, డాక్టరు చంద్రశేఖర్ ఆత్మహత్య వల్ల మరణించాడనే అభిప్రాయంలో ఉన్నారు. దీని విషయమై వాళ్ళకు గట్టిగా అనుమానం వుంది. ఇకమీదట మనం ఇద్దరం ఒకరినొకరు కలుసుకుంటూవుంటే, వాళ్ళు త్వరలోనే నిజం తెలుసుకుంటారు. అప్పుడు నీకు ప్రాణాలు ఆగిపోయే పరిస్థితి ఏర్పడుతుంది. నీ ప్రవర్తనను అతిజాగ్రత్తగా, నీకు తెలియకుండా వాళ్ళు పరిశీలిస్తుంటారు. ఏమైనా అనుమానాలు కలిగితే, వాటి పర్యవసానం తెలుసుకునే వరకూ, వాళ్ళు వొదిలిపెట్టరు. నీవు నాతో సంప్రదింపులు జరుపటం కూడా ప్రమాదకరం. మరీ ముఖ్యమైన అవసరవుంటే ఇక్కడికి నీవే స్వయంగా రావాలి. టెలిఫోనులో నన్ను పిలవదలచుకుంటే, మందులషాపునుంచి పిలుస్తూవుండు. అక్కడినుంచి అయినా వరుసగా రెండు సారులు పిలవవద్దు. తెలిసిందా?"

"అయితే పరిస్థితి ప్రమాదకరంగావుందా?"

## గమనిక

ఆంధ్రపత్రిక సచిత్ర వార పత్రికకు రచయితలు తమ రచనలను, ఉత్తర ప్రత్యుత్తరాలను సచిత్ర వారపత్రిక, 6,7 తంబుచెట్టివీధి, మద్రాసు-1. అనే చిరునామాకు మాత్రమే పంపాలి. —సం.]

"కాకపోవచ్చు. కాని మనం జాగ్రత్తలో వుండటం మంచిది."

"అయితే పరిహారం కోసం దావావేయను'

"కాదు; నీవు దావా వేయాలి. లేకపోతే మనం ఇద్దరం మునిగిపోతాం."

"ఔను? నాకూ అలాగే కనపడుతూంది."

"నీవు న్యాయవాదితో చాలా జాగ్రత్తగా మాట్లాడాలి."

"సరే మీరు నన్ను ఇప్పటికీ ప్రేమిస్తున్నారా?"

"ప్రేమిస్తున్నాననే విషయం నీకు తెలుసు కదా?"

"మీరు నా విషయం ఆలోచిస్తారా? ఎప్పుడూ ఆలోచిస్తూ వుంటారా?"

"ఊ! ఇంకా విశేషాలేమీ లేవనుకుంటాను."

"ఔను"

"సరే! నీవు వెళ్లు. నాకోసం ఎవరైనా రావచ్చు."

"నన్ను వొదిలించుకోవాలనుకుంటున్నారా?"

"కాదు ముందుగా జాగ్రత్తపడటం మంచిది."

"మిమ్మల్ని చూడటానికి నాహృదయం ఎప్పుడూ ఆరాటపడుతుంది."

"నీ హృదయావేదన నాగుండెల్లో ప్రతిధ్వనిస్తూవుంటుంది. మనం చాలా అప్రమత్తతతో వుండాలి."

"సరే"

* * *

నేను పడుకున్నాను. నా హృదయం ఆమె కోసం ఆరాటపడుతూంది. ఆమె నాదగ్గిరగావుండి శ్వాస బయటికి వదిలినప్పుడు, నాకు బలం, ధైర్యం కలుగుతున్నట్టుగా కనపడింది. నా జీవితంలో నేను ఎప్పుడూ చేయనిపని ఆరోజు రాత్రి చేశాను. నిద్రపోటానికి ముందు, భగవంతుణ్ణి ధ్యానం చేశాను.

—ఇంకా వుంది ★




గత సంచిక తరువాయి

## 5 వ అంకం

(స్థలం:-అదే. సమయం: సాయంత్రం 5 గంటలు. హాలులో ఒకవైపు సోఫా, మరో వైపు రెండు కుర్చీలు, మధ్య టేబిలు వున్నాయి. కుర్చీలో నిరంజన్ కూర్చుని వున్నాడు. దామోదరం కోపావేశంతో అటూ యిటూ తిరుగుతున్నాడు.)

దామో : వున్నవాడవు ఒక్కడవు. నీ గురించి నా ప్రాణం విసిగిపోతోంది. ఎన్ని సంబంధాలు చూసినా వద్దు పొమ్మంటావ్. అసలు నీ ఉద్దేశం ఏమిటి?

నిరం : (నిశ్చలంగా) అది మీకు నేను ఏనాడో చెప్పాను.

దామో : (కోపంతో) ఏం చెప్పావ్? యిప్పుడు పెళ్లి వద్దంటావ్. అంతేనా నువ్వ నేది.

నిరం : అవును అదే.

దామో : సరే! నువ్వు చెప్పినట్లే విని నీకు పెళ్ళిచెయ్యకుండా వూరుకుంటాననుకో— అప్పుడు నీవు పైమెరుగులకు భ్రమించి ఏ నాటకాలలో వేషం వేసేపిల్లనో పెళ్ళిచేసు కోవడానికి సిద్ధపడితే?

నిరం : అలా జరిగినా జరగవచ్చు. అందులో నాకేమీ తప్పు కనిపించడంలేదు.

దామో : (కోపంతో నిరంజన్‌ను నఖశిఖ పర్యంతం చూస్తూ) ఓహో! అంతవరకూ వచ్చావు. నిన్ను యిలా విడిచిపెట్టడం చాలా ప్రమాదం అని నేటికి ఋజువు అయ్యింది. ఆఖరుసారి అడుగుతున్నాను. నువ్వు వామనమూర్తిగారి అమ్మాయిని పెళ్ళిచేసుకుంటావా? లేదా?

నిరం : అది కలలోకూడా జరగడానికి వీల్లేదు.

దామో : ఆ పిల్ల అందచందాలలో ఏమైనా లోటు వుందా?

నిరం : ఎంతమాత్రం లేదు.

దామో : ఆమెకుచదువు తక్కువా?

నిరం : కాదు.

దామో : ఆమె తెలివితేటలలో ఏమైనా లోటుపాట్లు వున్నాయా?

నిరం : లేవు.

దామో : (కోపంతో) అయితే యిక నీ అభ్యంతరం దేనికి? ఆమెను పెళ్లిచేసుకోననడానికి కారణం యేమిటి?

నిరం : (సూటిగా) మరొకనికి మనసు యిచ్చిన యువతివైపు - జ్ఞానం తెలిసిన ఏ యువకుడూ కన్నెత్తి చూడడు. దయ చేసి యిక యీ విషయంలో నన్ను బల వంతం చెయ్యకండి.

దామో : క్షణికోద్వేగానికి లోనై దీర్ఘమైన జీవితాన్ని నాశనం చేసుకోకు. మరో నాలుగురోజులు టైం యిస్తున్నాను. ఆలోచించు.

(దామోదరం కుడివైపు నిష్క్రమిస్తాడు. ఎడమవైపునుంచి దండపాణి వస్తాడు.)

దండ : ఆయన్ని ఎతికిపట్టుకోమంటే నా తరమా? ఆనందంగారు నిన్నటినుంచి నా ప్రాణం తీసేస్తున్నారు.

నిరం : (పరధ్యానంగా) ఆయన ఎవరు?

దండ : అదేనండి! ఆయన-ఆయన పేరు ఏదోగాని చెప్పారండి. (ఆలోచిస్తూ) హుషార్.... కుషార్ ... అదేదో సరిగా గ్నాపకం రావడంలేదండి.

నిరం : కిశోర్ గురించా?

దండ : అదదీ! అదేనండి! దీని తస్సాదియ్యా! ఆ పేరు నోరు తిరక్కుండా వుందండి.

నిరం : అతని జాడ నీకు ఎక్కడైనా తెలిసిందా?

దండ : లేదు బాబూ! నిన్నటినుంచీ దారినిపోయేవాళ్ళందర్నీ చూస్తున్నాను.

నిరం : చూడు! చూడు! అతను లేక పోతే యిప్పుడు మన నాటకం ఆగిపోతుంది.

దండ : మనలో మనమాట! తిట్టి గెంటేసినతరవాత ఆ బాబు ఏ ముఖం పెట్టుకొస్తాడండి?

నిరం : (కోపంతో) మన నాటకమండలిలోని ఒక నటుణ్ణి అవమానపరచే హక్కు వామనమూర్తిగారికి ఎవరిచ్చారు? యీ విషయం యేదో నేను తేల్చుకుంటాను. నువ్వు వెళ్లిరా.

(నిరంజన్ ఎడమవైపు నిష్క్రమిస్తాడు. దండపాణి కుడివైపు నడుస్తూవుంటాడు. అతనికి వామనమూర్తి ఎదురు వస్తాడు.)

వామ : ఎక్కడికి పోతున్నావ్?

దండ : ఆఁ...మరి...రోడ్డుమీదకి ఎళ్తన్నానండి.

వామ : ఎందుకు?

దండ : మరి...ఆనందం బాబు...

వామ : ఏం చెయ్యమన్నాడు?

దండ : ఆఁ...మరి...(ఒక్కసారి జ్ఞాపకం వచ్చినట్లు) సిగరెట్ పెట్టె తెచ్చిపెట్ట మన్నారండి.



# నీలి తెరలు



వాసు : తరవాత ఆ కళ వచ్చు. ముందు మేడకెళ్ళి అమ్మాయిని పిలుచుకురా.

(దండపాణి మేడమీదికి వెడతాడు. వామనమూర్తి కోపంలో తిరుగుతూ వుంటాడు.—మేడమీది నుంచి ముందు చిత్ర వెనుక దండపాణి వస్తారు. చిత్ర ముఖంలో విషాదం కనిపిస్తోంది.)

చిత్ర:– (కోపంతో) ఎందుకు పిలిచారు!

వాసు:– దామోదరంగారు యిప్పుడు తిరిగి కనిపించారన్నమాట (దండపాణి యిద్దరికేసి ఒకసారి చూసి పెదవి విరిచి కుడివైపు నిష్క్రమిస్తాడు.

చిత్ర : యిక ఆమాట నాదగ్గర చెప్పకండి.

వాసు : వూరూపేరూ తెలియనివాణ్ణి—దారిని పోయేవాణ్ణి పెళ్ళి చేసుకుంటానంటావా? ఎవరైనా వింటే ఎంత అప్రతిష్ఠ!

చిత్ర : నన్ను అనవసరంగా విసిగించకు నాన్నా! నేనసలు పెళ్ళే చేసుకోను.

(తండ్రిమాటకు ఎదురు చూడకుండా గిర్రున తిరిగి మేడమీదికి వెళ్ళిపోతుంది. వామనమూర్తి నిస్పృహతో కుడివైపువెళ్ళిపోతాడు_ఎడమవైపునుంచి ఆనంద్, దినకర్ వస్తారు.)

దినకర్ : (సోఫాలో కూర్చుని పుస్తకం తెరచి) అర్థంచేసుకో బాగా అర్థం చేసుకో నీ పాత్రను అర్థం చేసుకొని నటించు. అప్పుడే నీవు ఉత్తమ నటుడవవుతావు. కాలానికి ఎదురీదకు! పురోగమనానికి అడ్డురాకు.

ఆనంద్ : దినకర్ మహాశయా, కనీసం నాలుగోరంగంలో నైనా ప్రణయ ఘట్టాన్ని చిత్రించండి.

దిన : చిత్రిస్తాను. పసిపాపకు పాలులేక ప్రణయాన్వేషులకు తన స్నేహాన్ని అమ్ముకున్న వెలయాలిని, యిహలోకపు మాయా నాగరుల పాలెగూళ్ళలో చిక్కుకున్న మందయానను చిత్రిస్తాను.

ఆనంద్ : నేడు ప్రేక్షకులకు కావలసింది వినోదం, హిత నాటకాన్ని విషాదంలో నింపితే లాభంలేదు.

దిన : వినోదం కావాలా? రాస్తాను. నెత్తుటోడ్చి అష్టకష్టాలకులోనై రైతు పండించే పంట సమస్తం ఏడు అంతస్తుల మేడలోకి రవాణా అవుతోంది. పేదరైతుకు చివరకు మిగిలేది గడ్డి. హహ్హహ్హ, అంతా శుద్ధ హాస్యం. కావలసినంత వినోదం.

ఆనంద్ : నవ్వులో రెండు రకాలు వున్నాయి. ఆనందాన్ని ఆపుకోలేక నవ్వే నవ్వు. రెండవది ఏడవలేక నవ్వేనవ్వు. యీ రెండవ తరగతి హాస్యం మాత్రం వద్దు కవిగారూ.

దిన : వెర్రి నాయనా! మన చుట్టూ కనిపించేది యీ రెండవ తరగతి హాస్యమే! మామిడిచెట్టుకు ఒకడు నీరుపోసి, గొప్పు తవ్వి, పెంచి పెద్దది చేశాడు. దాని పళ్ళు మరొకడు పట్టుకుపోయి తింటున్నాడు.— యిది అతిసున్నితమైన హాస్యం.

ఆనంద్ : ఆహాస్యం వల్ల మీ నాటకం వెలుగులోకి రాదు కవిగారూ!

దిన : దగాపడినసోదరమానవులతో నేనూ చీకటిలోకి నిష్క్రమిస్తాను. కంచుకాగడా వెలిగించి చీకటిని పటాపంచలు చెయ్యడానికి ప్రయత్నిస్తాను. మనిషికీ మనిషికీ మధ్య వున్న గోడలను పగల గొడతాను.

ఆనంద్ : మీ ముఖంలో ఆవేశం, కళ్ళలో ఎరుపు కనిపిస్తోంది.

దిన : (పుస్తకం తెరిచి) ప్రపంచాన్ని భస్మం చేసే శక్తి ఆటంబాంబుకు లేదు. నిరుపేదల కళ్ళలోని ఎరుపే ప్రపంచాన్ని భస్మం చెయ్యగలదు. ప్రమాదాన్ని యిప్పటికైనా గుర్తించు! నీ సుఖంలో, నీ సంతోషంలో కొంత భాగాన్ని అతనికి పంచు. ఉత్తమనటుడవనిపించుకో. జన్మించినప్పుడు ధనవంతుడు బంగారు హారాలతో జన్మించడం లేదు. దరిద్రుడు చింకి గుడ్డలతో జన్మించడం లేదు. జీవన యాత్ర ముగించినప్పుడు యిద్దరూ పవిత్ర ధరిత్రి యెదపై సరిసమానంగా పవ్వళించక తప్పదు. పుట్టుకలో చావులో యిద్దరికీ భేదం లేదు. వున్న భేదమంతా జీవనయాత్రలో. యీ భేదాన్ని సృష్టించిన హిరణ్యగర్భుడెవరో వెతికి పట్టుకోవాలి!

నిరంజన్ : (సరిగా చివరిమాట అనే సమయంలో ప్రవేశించి) వెతికి పట్టుకోవాలి ఆనంద్! నువ్వు ఖాళీగాకూర్చుంటే ప్రయోజనం లేదు. కిశోర్ లేకపోతే యిపుడు మన ప్రయత్నాలన్నీ వ్యర్థమౌతాయి.

ఆనంద్ : నిన్నటినుండీ జయరాం తీవ్రంగా వెతుకుతున్నాడు. వూరుదాటిపోతే చెప్పలేం కాని వూళ్ళో ఏమూల వున్నా అతను గాలించి పట్టుకోగలడు.

నిరం : (అసంతృప్తితో తిరుగుతూ) మన దగ్గర వంద రూపాయలు అడ్వాన్సు తీసుకొని, మన నాటకమండలిలో సభ్యుడై— కేవలం వామనమూర్తిగారు పొమ్మన్నంత మాత్రాన పోతాడా? నేనొప్పను.

ఆనంద్ : మనసు చెడి—తాత్కాలికావేశంలో ఎక్కడికో పోయివుంటాడు.

నిరం: వీల్లేదు. అతను ఎక్కడికీ పోవడానికి వీల్లేదు. ఏమైనాసరే, అతనిని యిప్పుడే వెతికి పట్టుకోవాలి. యీ రాత్రితో రిహార్సల్సు పూర్తికావాలి.

ఆనంద్: నేనూ అదేప్రయత్నంలో వున్నాను. దండపాణిని కూడా వెతకడానికి పంపాను.

దిన: (రాస్తూ)
మానస సరోవర తీరంపై కూర్చుని
మైమరచి ప్రకృతిని తిలకించు
ఇహలోకపు దుఃఖాలను విస్మరించు
నీ మనసును ప్రశాంతిపరచి
తిరిగి రమ్ము ఈలోకానికి.

(కుడివైపునుంచి దండపాణి ప్రవేశిస్తాడు)

ఆనంద్ : (ఆత్రుతతో) కనిపించాడా?

దండ: మీ వెర్రిగాని ఆయన కనపడతాడటండీ?

నిరం: (కోపంతో) ఎందుకు కనపడడు? సప్తసముద్రాలకు అవతలవున్నా వెతికి పట్టుకొంటాం. ఆనంద్, యిక ఆలస్యంచేస్తే లాభంలేదు. మనం యిద్దరం చెరో టాక్సీలోనూ వూరంతా వెతుకుదాం! లే!

ఆనంద్: సరే! ఏం చేస్తాం! పద!

(యిద్దరూ లేచి రెండు అడుగులు ముందుకు వేసేసరికి కుడి చివర జయరాం కనిపిస్తాడు. అతని ముఖంలో విషాదచ్ఛాయలు కనిపిస్తున్నాయి.)

నిరం: (ఆత్రుతతో జయరాంను సమీపించి) ఏమయ్యింది? ఎక్కడయినా కనిపించాడా?

జయ: (నిస్పృహతో కుర్చీలో కూలబడి) యీ విషాదవార్త ఎలా చెప్పను?

ఆనంద్ : కొంపతీసి కిశోర్ ఆత్మహత్య చేసుకోలేదుకదా?

జయ: లేదు. యింతవరకూ అటువంటిదేమీ జరగలేదు. యికముందు జరగకుండా వుంటుందని మాత్రం చెప్పలేం.

నిరం: (అసహనంతో) అసలు నీకు అతను కనిపించాడో లేదో చెప్పవేం?

జయ: కనిపించాడు. కాని మనిషి మనలో లేడు.

దండ: యిసారం మర్చిపోడానికి రెండు ముక్కలేసుకుని వుంటాడు.

ఆనంద్ : యిక్కడకు తీసుకురాకుండా వుత్తచేతులతో వచ్చావేం!

# ★ నీలి తెరలు ★

జయ : ఎంత ప్రతిమాలినా యిక్కడకు రావడానికి ఒప్పుకోలేదు.

నిరం : నాతో రా! ఎక్కడవున్నాడో చూపించు. అతనిని నిముషాలమీద యిక్కడకు తీసుకువస్తాను. ఆనంద్, నువ్వు యిక్కడేవుండు. మేం అయిదునిమిషాలలో కిశోర్ ను తీసుకువస్తాం.

(నిరంజన్, జయరాం కుడివైపు నిష్క్రమిస్తారు.)

దండ : మనిషంటే నిరంజనం బాబుగారే మనిషి! పట్టుదల అంటే అలాగుండాలి యీ రాత్రి మళ్లీ మనం నాటకం రిహార్సలు వేసుకుంటామన్నమాటే.

ఆనంద్ : యిక నీ అవసరం లేదు. నీ పోర్షన్ మొన్నటితో అయిపోయింది.

దండ : అదేంటండోయ్! అప్పుడే అయిపోతే ఎలాగా! నాకు మాటా పాటా లేని యేషం వద్దు. మరో మంచియేషం యిస్తారా లేదా?

ఆనంద్ : త్వరలో చూస్తాం.

దండ : డింకరుబాబుగారూ, మీరైనా సెప్పండి.

దిన : (పుస్తకంలోంచి తల పైకెత్తి) ఏమంటావ్?

దండ : నాకు మంచియేషం యిప్పించండి.

దిన : నీ వేషం అత్యుత్తమమైనది. నీకు ఒకరిని పీడించవలిసిన అవసరం లేదు. అన్యాయాలు, అక్రమాలు నీ చేతులారా నీ వెన్నడూ చెయ్యవు. నీ మాటలలో కృత్రిమం లేదు. నీ పాటలలో సహజత్వంవుంది.

ఆనంద్ : అదీ! అలా నచ్చచెప్పండి దినకర్. లేకపోతే రెండోరంగంలో నాలుగు మాటలూ ఒక పాటా పెట్టండి.

దిన : నీకు ఎటువంటిపాట కావాలి?

దండ. (ముందు బిగ్గరగా ఓ......అని రాగంతీసి తరవాత పాడతాడు.)

* ఓ...ఓ బలే శువి కొండల నడుమా
రొద్దులలోనే ముద్దుల మరిదీ
దాపలెద్దుకు దప్పికాయెనురా.

(ఓ......అని చివరః బిగ్గరగా రాగం తీస్తాడు.)

ఆనంద్ : (లేచి) చాలు! చాలు! మచ్చుకు యీ పాట ఒకటే చాలు. మరొకపాటపాడేవా యీ వీధిలోని మనుషులంతా లేచి యిక్కడకు రావచ్చు.

(కుడివైపునుంచి నిరంజన్, కిశోర్, జయరాం ప్రవేశిస్తారు. కిశోర్ జుత్తు చింది వందరగా వుంది.)

నిరం : (నచ్చజెప్పే ధోరణిలో) నేను వున్నంతవరకూ నీకేం భయంలేదు. నిన్ను ఎవరు ఏమన్నా నేను వూరుకోనేది లేదు.

కిశోర్ : యిక్కడ తిరిగి అడుగుపెట్టడం నాకు బొత్తిగా యిష్టంలేదు.

నిరం. రెండురోజులలో మన ఆఫీసును యిక్కడినుంచి మార్చేద్దాం. అంతవరకూ ఓపికపట్టు.

కిశోర్ : ఒక క్షణంకూడా యిక్కడ వుండడం నాకు యిష్టంలేదు. కాని మీకు ముందుగా మాటయిచ్చాను. యిక తప్పదు. అలాగే వుంటాను. ఏ క్షణంలోనైనా యిక్కడపరిస్థితి దుర్భరంగా కనిపిస్తే తక్షణం యీచోటు విడచిపెట్టవలిసి వుంటుంది.

నిరం : నీకు ఆ భయం అవసరంలేదు. నీకు అవమానం జరిగితే నాకు జరిగినట్లే భావిస్తాను. (హేండ్ బేగ్ లోంచి కాగితాలుతీసి) యిదిగో! నీ పోర్షన్! యిక టైమెంతో లేదు. వేగం చదువు. (దండపాణితో) దండపాణీ! వీరికి కాఫీతీసుకురా! (దండపాణి కుడివైపు నిష్క్రమిస్తాడు.) యిక మీరు రండి. మనం మిగిలిన ఏర్పాటులు చేసుకుందాం.

(నిరంజన్, జయరాం, ఆనంద్ ఎడమవైపు నిష్క్రమిస్తారు. కిశోర్ కుర్చీలో కూర్చుని తన పోర్షన్ చదవడానికి ఉపక్రమిస్తాడు. చదవలేక వికలమనస్కుడై చుట్టూ చూస్తూవుంటాడు. దినకర్ సోఫాలో కూర్చుని రాసుకుంటూనే వున్నాడు.

కిశోర్ : కవిగారూ, మనిషి చుట్టూ యిన్ని ఆకర్షణలు ఎందుకు వున్నాయి? వాటికి లొంగకుండా తప్పించుకునేశక్తి మనిషికి లేదా?

దిన : (తలపైకెత్తి) లేదు. నాయనా విచారించకు, నీ మనసును దృఢపరుచుకో! మానవుడవై జన్మించిన తరవాత కామక్రోధ లోభాలకు గురియైపోవక తప్పదు. (కుడివైపునుంచు దండపాణి ట్రేతో ప్రవేశిస్తాడు. యిద్దరికీ చెరోకప్పు అందిస్తాడు.)

కిశోర్ : మీరు యిక్కడ ఎందుకు వుంటున్నారు దినకర్?

దిన : మరో ప్రపంచానికి మార్గాన్ని వెతికేటందుకు:

దండ : అమ్మాయిగారికి సదుకు సెప్పడానికొచ్చాను.

కిశోర్ : (విచారంగా) దినకర్ మీరు నిజంగా ఎంత అదృష్టవంతులు! యీ ప్రపంచపు సుఖదుఃఖాలు మీదరికి చేరవు.

దిన: (ఖాళీకప్పు టేబులుమీద పెడుతూ) సుఖం, దుఃఖం నాచుట్టూ తాండవమాడుతూ వుంటే నేను కళ్ళు మూసుకు కూర్చోగలనా? ప్రజా సముద్రంలో నేనొక తరంగాన్ని. అన్ని కెరటాలతోపాటు నేను కూడా పైకిలేచి విరిగిపడక తప్పదు.

(ఖాళీకప్పులతో దండపాణి కుడివైపు నిష్క్రమిస్తాడు.)

కిశోర్: (లేచి తిరుగుతూ) ఒక్కో పరిస్థితిలో మనిషి తనకు యిష్టంలేనిపని చెయ్యవలసివస్తుంది. పరిస్థితులకు లొంగిపోక తప్పదు. యిష్టం లేకపోయినా నేనీ నాటకంలో పాత్ర నభినయించి తీరాలి.

దిన: అభినయించు. నిర్భయంగా నటించు. నీలో ఉత్తమ నటుని లక్షణాలు కనిపిస్తున్నై. నీవు నిరాటంకంగా ముందుకు సాగిపోగలవు. నిరాశలతోనిండిన నేటిని విస్మరించు. రేపు నీదే! అభాగ్య మానవ కోటికి శుభోదయం రేపే! అప్రమత్తతతో ప్రవర్తించు.

కిశోర్: నిన్నటికష్టాలు మానని గాయాలలా బాధ పెడుతున్నై. వాటిని మరిచిపోవడం సాధ్యమా?

దిన: నిన్నటి కష్టాలు రేపటి మహోదయంముందు దినకరునిముందు దివిటీవంటివి. అవి కనిపించవు. వాటికై చింతించకు. వెనుదిరిగి చూడకు. (రాస్తూ)

నిరాశల
నీలి తెరలు
తొలగిపోవు
శుభసమయం
రేపే! రేపే!
నిదుర లేచి
కనులు తెరచి
తరుణారుణ
కిరణాలకు
ఎదురుచూడు!
నిలచిచూడు!

(చదువుకుంటూ ఉన్మత్తునివలె ఎడమవైపు వెళ్లిపోతాడు దినకర్.) (ఇంకా ఉంది)

# ఇందుగలడందులేడని

బి. విద్యాసాగర్

"మామ్మగారూ! అబ్బాయిదగ్గర నుంచి మళ్ళీ ఉత్తరమేమన్నా వచ్చిందా!" అన్నాడు నారాయణ భోజనంచేస్తూ.

"లేదు నాయనా! ఎలా వున్నాడో యేమో!"

"మీదంతా పిచ్చి కానీ, అబ్బాయికి వంట్లో సుస్తీగావుంటే ఉత్తరం రాయడా యేమిటి! అతనికేమీ భయంలేదు. నిక్షేపంలా వుంటాడు."

"మాడు నాయనా! మొన్న మనం పంపిన డబ్బు వాడికి అందిందంటావా?"

"నిన్న చెప్పాను కదుటండీ! డబ్బు అందినటు రసీదుకూడా వచ్చిందని."

"అవునులే! మరిచిపోయాను" అంది రంగమ్మ పెరుగు వడ్డిస్తూ.

"మామ్మగారూ! ఈ హోటళ్ళలో మజ్జిగ, మంచినీళ్లు కంటేకూడా కనాకష్టంగా వుంటున్నదండీ! నేనందుకని రోజూ వొక పేట్టే పోతేపోయిందని పెరుగే వేసకుంటున్నానండి."

నారాయణ రంగమ్మగారింటికి వచ్చి పదిరోజులవుతున్నది. ఆ యింట్లోనే ముందుభాగం గది అద్దెకు తీసుకున్నాడు. నెమ్మదిగా రంగమ్మగారిని మంచి చేసుకొని తరచు వాళ్ళ యింట్లోనే భోజనం చేస్తున్నాడు. అక్కడ కాకపోతే యింకొకరి యింట్లో ముందుగానే చెప్పుకొని భోజనం చేస్తూవుంటాడు.

అతను రంగమ్మగారింట్లో వున్న కొద్దిరోజులలోనే ఆమెకు నారాయణ అంటే మంచి విశ్వాసం యేర్పడింది. రంగమ్మగారి కొడుకు గోపాలం మద్రాసులో చదువు కుంటున్నాడు. అతని ముఖము అయితే నారాయణ ఎప్పుడూ చూడలేదు కానీ అతనికి ప్రతిసారీ రంగమ్మగారు నారాయణ చేతే ఉత్తరాలు వ్రాయిస్తూ వుంటుంది. ఒక్క ఉత్తరాలేమిటి! గోపాలానికి ప్రతిసారీ నారాయణే మనిఆర్డర్లు కడుతూ వుంటాడు. ఇంతచేస్తున్నా గోపాలాన్ని, నారాయణ వొకసారయినా చూడలేదు. నిజానికి చూడాలనే కుతూహలము కూడా లేదు.

"అబ్బాయిని వొకసారి రమ్మని ఉత్తరం రాద్దామా యేమిటి" అంది రంగమ్మగారు.

"ఎందుకండీ! అతనికి పరీక్షలేమన్నా వుంటాయేమో, యిప్పుడు! అయినా అతను వచ్చి యిప్పుడు చేసేదేముంది? ఎలాగో రేపు శెలవులలో వస్తాడాయెను" అన్నాడు నారాయణ భోజనంనుంచి లేస్తూ.

*    *    *

ఉదయం పదిగంట లవుతుంది. వీధిలో జనసంచారం అంతగాలేదు. వీభూదిరేఖలు పెట్టుకొని వొక బ్రాహ్మడు రోడ్డువెంబడి నడిచివస్తున్నాడు. కొంతవరకూవచ్చి ఒక యింటిముందు ఆగిపోయాడు. వెళ్ళి ఆ యింటి తలుపుతట్టాడు.

"ఎవరండీ యింట్లో" అన్నాడు కేక వేస్తూ.

"ఏమి నాయినా! ఏమి కావాలి" అన్నాడు తలుపుతీసిన మాధవరావు విసుక్కుంటూ.

"మీ అమ్మగారు లేదండీ?"

"ఉన్నది! ఏమిటి పని."

"ఆమెను ఒకసారి పిలుస్తారా!" అన్నాడు అయన.

అతను యేమనుకున్నాడో యేమో తల్లిని పిలుచుకువచ్చాడు. ఆవిడ రావటంచూసి

"అమ్మా! మాది నాగాయలంక! ఇవాళే ఈవూరు వచ్చాము. మా వూళ్లో అగ్నిప్రమాదం వచ్చి మా ఇల్లు తగులపడిపోయింది. మా ఆడవాళ్లు నిప్పులలోనుంచి ఎలాగో ప్రాణాలతో బయటపడ్డారు. చాలా ఆస్తిపోయింది లెండి! బోలెడు వెండిసామాను ఖరీదైన చీరలూ, నగలూ, అన్నీ నిప్పులలో మసి అయిపోయినాయ్!" అన్నాడు కంట తడిపెడుతూ.

"చాలు చాలు లేవయ్యా! ఇలాంటి వాళ్ళను చాలామందిని చూశాము" అన్నాడు మాధవరావు వురిమిచూస్తూ.

"మీరలా అంటారని నాకు తెలుసు! నేను చెప్పేది నమ్మ శక్యంగాకుండా వుంటుందని కూడా తెలుసు! అందుకనే బాధను మనస్సులోనే అణుచుకున్నాము! ఎంత వూరుకుందామన్నా పదివేలు ఖరీదు చేసే ఇల్లు పోయిందంటె మనస్సు వూరుకోనంటున్నదండీ! వుండటానికి నీడలేక మా పిల్లలు నానాబాధలుపడుతూ సత్రంలో వున్నారు. ఉన్న బాధలు చాలనట్లు మధ్యలో

# ★ ఇందుగలడందు లేడని ★

మా ఆవిడను ఆసుపత్రిలో చేర్పించవలసి వచ్చింది. ఇల్లు తగులపడిపోయినపుడు దానికి కాళ్ళూ, చేతులూ కాలిపాయ్! దాని స్థితి చూడబోతే అలావుంది! పిల్లల్ని చూడబోతే కట్టుకోటానికి గుడ్డలుకూడా లేక బాధపడు తున్నారు. ఈ ఆపత్సమయంలో మీలాంటి ధర్మాత్ములు..."

"సంతోషించాము కానీ యిక బయటకు పదు!" మాధవరావు విసుక్కున్నాడు.

"వూరుకోరా, నాయనా! అయనేదో కష్టాలలో వుండబట్టే మనింటికి వచ్చాడు. లేకపోతే ఆయనకు మన గుమ్మం ఎక్కవలసిన పని యేముంది" అంది సీతమ్మగారు.

"బాగా చెప్పారు! మేమూ బాగా బ్రతికినవాళ్ళమే! ఒకళ్ళకింతపెట్టి మేము యింత తిన్నవాళ్ళమే! ఎటొచ్చీ అకస్మాత్తుగా యిల్లు తగలపడటం, ఆస్తి అంతా నష్టమయిపోవడంతో ఈ స్థితికి వచ్చాము కానీ."

"మా అబ్బాయి మాటలకు మీరేమీ మనస్సు కష్టపెట్టుకోకండి! వాడి తీరే అంత! సరిగా మాట్లాడటం వాడికి తెలియదు."

"చాలులే! చెప్పొచ్చావు!... అయినా నువ్వు ఏమి చేసుకుంటే నాకు ఎందుకు" అంటూ మాధవరావు బయటకు వెళ్లాడు.

"చూడు నాయనా! ఈపూట మా యింట్లో భోజనానికి వుండు! సరిగ్గా సమయానికి వచ్చావు" అంది రంగమ్మగారు లోపలకు వెళ్తూ.

"అలాగే" అంటూ కుర్చీలో కూర్చున్నాడాయన.

ఆవిడగారు అలా లోపలకు వెళ్ళగానే ఆ బ్రాహ్మడు గదిఅంతా వొకసారి కలయ చూశాడు. నెమ్మదిగా కుర్చీలోనుంచి లేచి పక్కగదిలోకివెళ్లి అక్కడున్న సామగ్రి నంతా వొకసారి పరిశుచేసి మళ్లీ వచ్చి కూర్చున్నాడు.

మధ్యాహ్నం భోజనముందు ఆయన వేదాంతంపై అనర్గళంగా ఉపన్యసించాడు. భోజనం అయినతరువాత ఆవిడ యిచ్చిన అయిదురూపాయలుకొంగునకట్టుకున్నాడు. సీతమ్మగారు మళ్లీ వంటింట్లోకి వెళ్లి టంచూసి రెండు వెండిమరచెంబులూ, గ్లాసులూ, యింకొ విలువైనసామాన్లూ అవీ చేతికంది నంతవరకూ చేతపుచ్చుకొని చల్లగా జారుకున్నాడు.

ఆరోజుసాయంత్రం నారాయణ యిల్లు చేరుకునేటప్పటికి రంగమ్మగారు వాకిట్లోకి వచ్చి

"ఏమినాయనా? ఇంతఆలస్యమయిందే" అంది.

"పనుండి అలా బజారుకువెళ్లాను"

"సరేకాని, యిదివిన్నావా! ఇవాళ మాచెల్లెలుగారింటికి ఎవరో బ్రాహ్మడు వచ్చి, చల్లగా చేతికందిన వెండిసామాను అంతా ఎత్తుకుపోయాడట"

"అవునండీ! నేనూ యింతకుముందే బజారులోవిన్నాను. ఈరోజుల్లో అజాగ్రత్తగావుంటే లాభంలేదండి"

"అసలు అనుమానపడటానికికూడా వీలు లేకుండా జరిగిందిటయ్యా! పైగా మధ్యాహ్నం వేదాంతంగురించి మాట్లాడాడట కూడా!"

"అయితే చూడండి! నాచెల్లెలు ఎవరండీ ఈవూళ్ళో"

"నీకు తెలియదా యేమిటి? మాచెల్లెలూ వాళ్ళు బుట్టాయపేటలో వుంటున్నారుగా"

"అహా! నాకు తెలియదులెండి."

"కబుర్లలో పొద్దుపోతున్నది. భోజనం చేద్దువుగానిలే!"

"నాకు ఆకలిగాలేదండీ" అన్నాడు నారాయణ మాటవరుసకి.

"ఫరవాలేదులే! అయినంత తిందువుగాని! అన్నట్లు మరిచిపోయాను. అబ్బాయి దగ్గరనుంచి యివాళ ఉత్తరం వచ్చింది. మా మాధవుడు చదివిచెప్పాడు."

"ఏమని" అన్నాడు నారాయణ.

"ఏమిటో వాడికి డబ్బు సరిగాఅందటం లేదంటాడు. వందపంపించమంటే యాభై పంపితే ఎలాగంటాడు"

"విచిత్రంగావుందే! బహుశ అతనికి రెండువందలు కావలసివస్తే మనము పంపిన వంద యేమూలకూ చాలలేదేమొ! అందుకే అలా రాసివుంటాడు"

"ఏమో, నాయనా! వాడిఉత్తరం చూస్తే నాకేమిటో దిగులుగావుంది. డబ్బు చాలక యేమిఅవస్థలు పడుతున్నాడో మాచిట్టినాయన"

"మీరేమీ దిగులుపడక్కరలేదండీ! వాళ్లదంతా చిన్నతనం! వాళ్లుఅడిగినంతా పంపితే యిక సంసారాలుచేసినట్లే! వాళ్ళకేమి? బాధ్యతతెలియదు. అడిగినప్పుడల్లా రెండువందలు పంపించాలంటే ఎక్కడ నుంచి తెస్తాము"

బాగా చెప్పావు. మావాడు ఈ మధ్య బాగా ఖర్చుపెట్టడం నేర్చుకున్నాడులే!... ఏమిటో! మళ్ళీ కబుర్లలో పడ్డాము! లే నాయనా! భోజనం చేద్దువుగానీ" అంది రంగమ్మగారు వంటయింట్లోకి వెళ్తూ.

నారాయణ ఆమెవెంట లోనికి వెళ్లాడు.

*　　*　　*

గోపాలం అప్పుడే రైలు దిగాడు. స్టేషన్ బయటకు వచ్చి బండీకోసం వెతుకుతున్నాడు. ఇంతలో వొకపెద్దమనిషి హడావుడిగా అటూ యిటూ తిరుగుతూ గోపాలం దగ్గరకు వచ్చి,

"ఏమండోయ్! మిమ్మల్నే!...ఆపినందుకు క్షమించండి! ఏమీలేదు! నా పర్సు పోయిందండీ ఈ రైలులో! ఎలాపోయిందో ఏమో చిత్రంగా వుంది. గుడివాడ వచ్చేదాకా నాకు జ్ఞాపకం. పర్సు నాజేబులోనే వున్నది. ఈమధ్యలోనే ఎవడో కాజేశాడు"

"అలాగా! వెంటనే చూసుకోలేదుటండీ."

"చూసుకుంటే దిగులెందుకు! నాకుకొద్దిగ నిద్ర పట్టింది. మళ్ళీ మెలకువ వచ్చేటప్పటికి

జేబులో పర్సు మాయమయింది. ఇలా వున్నాయి ఈ రోజుల్లో దొంగతనాలు.

"ఏమాత్రం పోయిందండీ."

"కొస్తా కూస్తా కాదు. ఆరు వందలు. ఎవడు పొట్టను పెట్టుకున్నాడో యేమోకానీ, క్రొత్త పర్సు అండి."

"పోలీసు కంప్లయింట్ ఇవ్వక పోయారా?"

"ఏమిటో మన పిచ్చికానీ, ఇస్తే మాత్రం దొరుకుతుందటండీ!......పర్సు పోతే పోయింది. మళ్ళీ ఇంటికి పోవడానికి కూడా డబ్బు లేదుకదా! చెప్పుకుంటే సిగుచేటు."

"పాపం!...ఏవూరు వెళ్లాలండీ మీరు."

"అమలాపురమండీ! రైలు చార్జీకూడా చాలా అవుతుంది. నాకు అడగటానికి కూడా సిగ్గుగా వుంది. మీకేదయినా కొద్దిగా..."

"దానికేముండి! ఈ నాలుగు రూపాయిలూ తీసుకోండి. మీకు ఎలాగూ చాల దనుకుంటాను. ఇంకా ఎవరినన్నా అడిగి చూడండి" అంటూ గోపాలం పర్సు తీసి డబ్బు ఇచ్చాడు.

"థాంక్సు" అంటూ ఆయన వెళ్ళిపోయాడు.

గోపాలం రిక్షా యెక్కి యిల్లు చేరుకున్నాడు. రంగమ్మగారు అతన్ని చూసి ఆశ్చర్యపోయింది.

"ఏమిటిరా ఈ త్తరం ముక్కయినా రాయకుండా వచ్చేశావు" అంది రంగమ్మగారు.

"ఒంట్లో యేమీ బాగుండటం లేదమ్మా! నాలుగు రోజులనుంచీ జ్వరం వస్తున్నది. అందుకని వెంటనే బయలుదేరి వచ్చేశాను."

"మంచిపని చేశావు. సరే కానీ నేను పంపిన డబ్బు నీకు ముట్టిందా?"

"ముట్టింది కాని, ఏమిటమ్మా ఈ మని ఆర్డర్లు కడుతున్నది. ప్రతిసారి వంద అడిగితే యాభై మాత్రం నాకు వస్తున్నది"

"అలా అంటావేమిటిరా! మనింట్లో నారాయణగారని వొకాయన అద్దెకు వుంటున్నాడు. చాలా మంచివాడు. ఆయనే నీకు ప్రతిసారి డబ్బు పంపుతున్నది"

"ఇంకేమి! ఈపాటికి చాలానే పోగుచేసి వుంటాడు. అయినా ఆయన నీకు ఎక్కడ దొరికాడు. మన మాధవరావు చేత పంపిస్తే పోయేదిగా!"

"ఇప్పుడు మాత్ర మేమయిందిరా"

"అయితే నీకు అర్థం కాలేదన్నమాట! ఆ నారాయణ చాలా డబ్బు కొట్టేశాడమ్మా తెలిసిందా"

"ఏమిటిరా! డబ్బు కొట్టేసిందెవరు" అంటూ మాధవరావు వచ్చాడు.

"ఇంకెవరు! మాయింట్లో వుంటున్నాయన! ఎవరో నారాయణట! ఏమి నారాయణో కాని"

ఇంతలో 'రంగమ్మగారూ' అంటూ నారాయణ లోపలకు వచ్చాడు. కోటూ అదీ తొడుక్కొని చూడటానికి బాగానే వున్నాడు. అతన్ని చూసి గోపాలం ఆశ్చర్యపోయాడు! మాధవరావు నిర్ఘాంతపోయాడు!!

"ఏమండీ! అమలాపురం పోతామన్నారు ఇక్కడకు వచ్చారేమిటి" అన్నాడు గోపాలం.

నారాయణ గతుక్కుమన్నాడు. ఏదో చెప్పపోయాడు.

ఇంతలో రంగమ్మగారు అందుకుని "అమలాపుర మేమిటిరా! ఆయన మనింట్లో వున్న నారాయణగారు"

"చంపేశావుపో! ఈయన నాకు స్టేషను దగ్గర కనపడి, తన పర్సుపోయిందని నాలుగు రూపాయిలు తీసుకున్నాడు. ఏమయ్యా! ఏమిటి వేషం" అన్నాడు గోపాలం నారాయణ వంకకు తిరిగి.

"ఆయనను అడగటం దేనికి? ఆయన సాక్షాత్తూ నారాయణమూర్తి! మొన్న మా యింట్లో వెండిచెంబులు కాజేసిందికూడా ఈయనే పెద్దమ్మా! అనుమానంలేదు! ఎంత వినయంగా మాట్లాడాడు ఆవేళ"

"ఏమిటిరా! అంతా వింతగా వుందే."

"ఏంతేముంది పెద్దమ్మా! ఆయన రోజు కొక అవతారమెత్తుతున్నాడు. ఏమిచేస్తాము మరి! 'ఇందుగలడందు లేదని...అని వూరికే అన్నారా!" "ఈ కబుర్లుకేమికాని, ముందు ఆయనని పోలీసు స్టేషన్‌లో అప్పజెప్పి తీరికగా మాట్లాడుకుందాము" అంటూ గోపాలం లేచాడు.



# హూణదౌర్జన్యం

౧

గాంధార రాజకన్యక స్వయంవరానికి యాదవ కుమారులు విచ్చేశారన్న వార్త కాశ్మీరాధిపతి దామోదరభూపతి చెవిని పడింది. ఆ వార్త వింటూనే అతడు తోక తొక్కిన తాచులా మండి పడ్డాడు. వెంటనే కాశ్మీర సైన్యాలన్నీ సమాయత్తపరిచి గాంధార దేశంమీదికి దండెత్తి వెళ్ళిపోయాడు.

అతడావిధంగా యాదవులపై మండిపడి దండెత్తిపోవడానికి ఒక ముఖ్యకారణం ఉంది. పూర్వం యాదవులకు, జరాసంధునికీ మధ్య జరిగిన ఒక ఘోర యుద్ధంలో దామోదరభూపతి తండ్రి జరాసంధుని పక్షం వహించి యాదవులతో యుద్ధం చేశాడు. దానితో యాదవులాయుద్ధంలో పూర్తిగా పరాజితులై పోవలసిందే!

కాని ఆ సమయంలో హఠాత్తుగా బలరాముడడ్డుపడి దామోదరభూపతి తండ్రిని సంహరించి వేశాడు.

దామోదరుడప్పటినించీ యాదవులపై పగదీర్చుకోవాలని ఎదురుచూస్తూ నేవున్నాడు ఇన్నాళ్ళకతనిసంకల్పం నెరవేరింది.

కాశ్మీరాధిపతి సైన్యాలు, యాదవుల సైన్యాలు గాంధార దేశం అంతా ఒక భీషణ యుద్ధరంగంగా మార్చివేశాయి. ఆ భీభత్సంలో గాంధార రాజకన్య స్వయంవరం మాట తలపెట్టే వారే లేకపోయారు!

యాదవులకు, దామోదరునికీ మధ్య జరిగే ఆ మహాయుద్ధంలో విజయలక్ష్మి ఎవరిని వరించేదీ ఎవరూ నిర్ణయించ లేకపోయారు. ఇరుపక్షాలవారు ఒకరొకరికి తీసిపోకుండా సరిసమానంగావీరవిహారంచేశారు. ఆ సమయంలో ఆ యుద్ధం ఎటూ తేలక పోవడంవల్ల విజయలక్ష్మి చేతనున్న స్వయంవర మాలిక అలాగే వాడిపోయిందని కల్హణ మహాకవిరాజతరంగిణిలో చమత్కరించాడు.

కాని విజయలక్ష్మి కిరుపక్షాలలోను ఎవరినో ఒకరిని వరించ తప్పలేదు. చివరికి యాదవులే ఆ యుద్ధంలో జయించారు. కాశ్మీరాధిపతి శ్రీకృష్ణుని చక్రాగ్నిజ్వాల కాహుతి అయిపోయాడు. ఆ అఘాతంతో కాశ్మీరసైన్యాలన్నీ చెల్లాచెదరై పారిపోయాయి.

ఆ తైన యాదవ మహామాత్యులందరు కాశ్మీర రాజ్యం చల్లగా కబళించివెయ్యడమే మంచిదని శ్రీకృష్ణునిచెవిలో ఇల్లు కట్టుకునిపోరారు. కాని శ్రీకష్ణుడామాటలు చెవి కెక్కనీయలేదు.

ఒక పౌరాణిక శ్లోకం ఉదాహరించి ఆ దుష్ట సంకల్పం న్యాయ్యంకాదని వారినందరినీ నివారించాడు :

> "కశ్మీరా పార్వతీ తత్ర
> రాజా జ్ఞేయః శివాంశజః
> నావజ్ఞేయః స దుష్టోపి
> విదుషా భూతి మిచ్ఛతా."

## ప్రాచీన గాథాలహరి

"కాశ్మీర భూమి సాక్షాత్తు పార్వతీదేవి! ఆ భూపరిపాలకుడు శివాంశసంభూతుడు. అతడు కేవలం దుష్టుడే అయినా ఐశ్వర్యకాములయిన వారెవరు అతని నవమానింపరాదు !"

శ్రీకృష్ణుడా పౌరాణిక శ్లోకం ఉదాహరించగానే మంత్రులెవరు మరి మాట్లాడలేకపోయారు. ఆపైన దామోదర భూపతి పత్ని గర్భవతి అని కూడా తెలిసింది. శ్రీకృష్ణుడామెను స్వయంగా కాశ్మీరాజ్యంలో అభిషేకించి వెంటనే ద్వారకానగరానికి తిరిగి వెళ్ళిపోయాడు.

అప్పటినించీ పరమ ధార్మికులైన మహారాజులెందరందరో కాశ్మీర రాజ్యం పరిపాలించారు. మరి పర రాజన్యులెవరు కాశ్మీరరాజ్యం కబళింపవలెననే దుష్ట సంకల్పానికి లోనుగాలేదు. కాని కాలం మారినకొద్దీ ఆపౌరాణిక శ్లోక మర్యాదబాగా మరుగునపడిపోయింది. క్రమక్రమంగా మ్లేచ్ఛులు, శ్వేతహూణులు మొదలైనవిదేశీయులు భారత భూభాగంపై జైత్రయాత్రలు ప్రారంభించారు. క్రమంగా కాశ్మీరం కూడా ఆ జైత్రయాత్రల ధాటిలో పడి ఛిన్నాభిన్నమై నలిగిపోయింది.

కాశ్మీరాధిపతిని తొలగించి కాశ్మీరం ఆక్రమించిన హూణులలో మిహిరకులుడు సాక్షాత్తు కాలాంతకుడే! దూరందూరంగా గద్దలు, రాంబందులు మొదలైన పక్షులాకాశంలో కనిపించగానే ప్రజలందరు మిహిరకులుడు సైన్యాలతో విరుచుకుపడుతున్నాడని గ్రహించి ప్రాణాలరచేత పెట్టుకుని పారిపోయేవారట!

ఒకనాడు మిహిరకులునికి పత్ని కంచుకంపై సింహళదేశాధిపతి స్వర్ణపాదముద్ర కనిపించింది. ఆ ముద్ర చూడగానే అతడుగ్రుడైపోయాడు. క్రోధావేశంతో అతని కన్నులు రాజుకున్నాయి. అలాంటి సమయంలో అతని సన్నిధికి వెళ్లడానికెవరు సాహసించరు! కాని మిహిరకులుడే అంతఃపుర కంచుకిని గొంతెత్తి పిలిచాడు. రాణి కంచుకంపై సింహళేశ్వరుని పాదముద్ర లుండడానికి కారణమేమని మండిపడ్డాడు. కంచుకి ధైర్యంచిక్కబట్టి నెమ్మదిగా ప్రత్యుత్తరం ఇచ్చాడు :

"మహాప్రభూ! తాము నామనవి కొంచెం సావధానంగా చిత్తగించాలి. సింహళదేశంలోని సాలెవారంతా తాము నేసే వస్త్రాలపై రాజపాదముద్రలు ముద్రిస్తారు. అది ఆదేశాధీశుని ఆజ్ఞ! అయితే ఆదేశం నుంచి వచ్చే వస్త్రాలు బహుసున్నితమైనవి. రాణివాసం వారందరు తామై కోరి కోరి ఆవస్త్రాలు ధరిస్తున్నారు. అంతేగాని దీనిలో కేవరవారి యెడల జరిగిన అపరాధమేమీ లేదు!"

పి. గణపతిశాస్త్రి



అయినా మిహిరకులుని కది సరియైన ప్రత్యుత్తరంగా వినిపించలేదు! సింహళ దేశాధిపతి తన్నవమానించాడనే నిశ్చయించాడు. వెంటనే ప్రచండ సైన్యంతో సింహళం మీదికి దండెత్తి వెళ్ళిపోయాడు. మార్గంలో అనేక రాజ్యాలు, నగరాలు నేలమట్టం చేసివేస్తూ కొంతకాలానికి సింహళ దేశం చేరుకొన్నాడు తరవాత జరిగిన యుద్ధంలో సింహళ దేశాధిపతిని తొలగించి వేసి తన ప్రతినిధి కర్ణుడ పట్టాభిషేకం చేశాడు. ఆదేశం వస్త్రాలపై మిహిర(సూర్య) ముద్రలుముద్రింపించి వెనువెంటనే కాశ్మీరానికి తిరిగివచ్చి వేశాడు. మంత్రులతని దురభివేశము, క్రౌర్యదీక్ష, అకుంఠిత పరాక్రమము చూచి నిశ్చేష్టులై గజగజవణికారు!

౨

మిహిరకులుడు కాశ్మీరద్వారం చేరుకోగానే భీషణాతి భీషణమైన మరి ఒక సంఘటన జరిగింది. అతని గజసైన్యంలోని ఏనుగులొకటొకటిగా నగరద్వారం చేరుకొంటున్నాయి వాటిలో కొంచెం ఒక వయసుమళ్లినఏనుగు నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ నడిచివస్తోంది. కాశ్మీర ద్వారం చేరుకునేముందాగజ సైన్యం అంతా ఒక పర్వతం దాటిరావాలి. అది చాలా ఎత్తైన పర్వతం. సైన్యంలోని ఏనుగులన్నీ ఆపర్వతం దాటివేశాయి. ఇక మిగిలినవి కొన్నే ఏను. వాటిలో కొంచెం ముసలిది పోయిన ఏను

# ★ హూణ దౌర్జన్యం ★

గొక్కొక్క అడుగే వేసుకుంటూ పర్వతంపై కెక్కింది.

కాని పర్వతంమీదినుంచి క్రిందికి దిగే తరుణంలో గభాలున దానికాలు జారింది. పాపం అది హృదయవిదారంగా ఘీంకారం చేస్తూ కొండక్రిందికి దొర్లిపోయింది. ఉత్తర క్షణంలో ఒక పెద్దరాతి బండలా తుత్తునియలైపోయింది!

గజసైన్యంలోని వారంతా దాని దుర్మరణం చూచి కంట నీరు పెట్టుకొన్నారు. హృదయవిదారకమైన దాని కరుణాక్రందనం వారి హృదయాలన్నీ కలిగించివేసింది. దానికి సంభవించిన దారుణ మరణం చూడలేక వారంతా హాహాకారాలు చేశారు. హృదయవిదారకమైన దాని ఘీంకారం వారిహృదయాలలో నూతిలో మునిగిపోయే ఒక అభాగ్యుని జాలిపిలుపులా సన్నసన్నగా మారుమోగింది.

కాని మిహిరకులుని కాకరుణాక్రందనం వినగానే ఆనందపారవశ్యంవల్ల ఒళ్ళంతా జలదరించింది! అతడా ఆనందం పట్టలేక ఒక్క పెద్ద గావుకేక పెట్టాడు!

ఉత్తమ పురుష లోకరు సుఖిస్తూంటే చూచి ఆనందిస్తారు. తమ శాయశక్తులా వారికి సాయంచేస్తారు. అదే వారికి మహానందం. మధ్యములు తటస్థులుగా ఉంటారు. అధము లొకరి ఆపత్తుచూచి తమకు తెలియకుండానే లోలోపల ఆనందిస్తారు. అధమాధములు పనిగట్టుకుని అమాయికుల కపకారంచేసి అది కళ్ళారాచూచి ఆనందిస్తారు. అందులోనూ ఒక పెద్దఏనుగు కాలుజారి పడిపోవడంతో మిహిరకులుని హృదయంలో ఒక అపూర్వమైన ఆనందాతిరేకం పెల్లుబికి వెల్లువలై ప్రవహించింది!

ఆ మరునాటి ఉదయమే అతడొక నూరు ఏనుగులను వరసగా ఆ కొండచరియలపై నిలబెట్టించాడు. వరసగా ఒకొక్క ఏనుగునే కొండమీదినించి క్రిందికి పడదోయించాడు. ఆ అమాయికప్రాణు లతికరుణంగా, అతి దీనంగా ఘీంకారాలుచేస్తూ ఆక్రోశిస్తూంటే మహదానందంతో మైమరచి నృత్యం చేశాడు. ఆ దారుణంతో మానవ హృదయ క్రౌర్యం ఒక అవధికి వెళ్ళిపోయింది. అంతటితో మిహిరకులుని హృదయానందం మిన్నందుకుంది!

ఆ దుర్వార్త విని శ్రీనగర పౌరులు హడలెత్తిపోయి హాహాకారాలు చేశారు. ఏ క్షణంలో తమకెలాంటి ఆపదలు రాగలవో అని ఆబాలగోపాలము అట్టుడికిపోయినట్టుడికిపోయారు! మిహిరకులుని కోపథాటికెదురుగా నిలిచిన వారెంతటి అమాయకులైన పసిపాపలైనా సరే! ఎంతటి ఎండకన్నెరగని శీలవతులైనాసరే! ఎంతటి ముక్కాలి ముదుసల్లయినా సరే! అందరు అతని హూణసేనా దౌర్జన్యానికి బలిఅయిపోవలిసిందే! ఆ పరిస్థితులలో ఇక ఎవరేమిచెయ్యగలరు!

మరి కొంతకాలంవరకు శ్రీనగరంలోని ప్రజానీకం గుప్పిళ్లలో ప్రాణాలు పెట్టుకుని అతనికోపథాటి రెచ్చిపోకుండా గుట్టుగా అలాగే కాలక్షేపం చేశారు.

కాని వారి కష్టాలంతటితో గట్టెక్కలేదు. మరి కొంతకాలానికి మిహిరకులునికి కాశ్మీరంలోని చంద్రకుల్యానది కానకట్ట కట్టి, ఆ నది నింకొకవైపు మళ్ళించాలని సంకల్పం కలిగింది. ఆనకట్ట కట్టడమేమో జరిగిపోయింది గాని నది నింకొక వైపుమళ్లించడమే సాధ్యపడలేదు. నదీమార్గంలో ఒక పెద్ద రాతిబండ అడ్డుపడింది. ఎంతమంది ప్రయత్నించినా అది తొలగించడం సాధ్యపడలేదు. ఆ వార్త మిహిరకులునివరకు వెళ్ళింది. ఆ బండ కదిలించడం ఎవ్వరికీ సాధ్యపడకపోతే పదిమంది పది విధాలుగా మాట్లాడుకోవడం మొదలుపెట్టారు. కొందరది ఏదో దేవత మహత్తని ఆకాశం వైపు చూపించారు. మరి కొందరది మానవ మాత్రులకు సాధ్యమయ్యేపనిగాదని చప్పరించివేశారు. ఇంకా కొందరెవరో యక్షుడొక డారాతిబండమీద తిష్ఠవేసుకుని కూర్చున్నాడని అన్నారు.

ఆ మరునాటి ఉదయమే మిహిరకులుడొక ఆజ్ఞ శ్రీనగరంలో అంతటా చాటింపించాడు. ఆనగరంలోని కులీన మహిళ లొకరొకరే వచ్చి ఆ శిల ఒకమారు తమ వేళ్ళతో స్పృశించి వెళ్ళిపోవాలని ఆజ్ఞాపించాడు. మొట్టమొదట ఆ ఆజ్ఞలోగల అంతరార్థం ఎవరికీ అంతు చిక్కలేదు.

గతరాత్రి మిహిరకులుని కొక కలవచ్చినదనీ ఆ కలలో ఒక యక్షుడు డతనికి కనబడి ఆ శిలమీద తానున్నాననీ శీలవతు లెవరయినా స్పృశించిన పక్షంలో వెంటనే తొలగిపోగలనని చెప్పాడనీ కొందరు గుసగుసలాడుకొన్నారు. మిహిరకులుని కావిధమైన కల వచ్చినమాట వాస్తవమే. కాని ఆ ఉన్మత్తుని ప్రలాపాల కంతరార్థం అతనికే తెలియాలి!

ఏది ఏమైనా మరునాడు శ్రీనగరంలోని శీలవతులైన మహిళ లొకరొకరేవచ్చి ఆ శిల స్పృశించారు. వెనువెంటనే రాజభటులా శిల కదిలించడానికి శాయశక్తులా ప్రయత్నించేరు. కాని ఎంతిసేపటికీ వారి ప్రయత్నాలు ఫలించలేదు. చిట్టచివరిని కొక కుమ్మరి స్త్రీ తన మునివేళ్లతో ఆ శిల స్పృశించింది. రాజభటులు శాయశక్తులా ప్రయత్నించడంవల్లనయితేనేమి, ఆ కులాలమహిళ స్పృశించడంవల్లనయితేనేమి ' చిట్టచివరికాశిల కదిలింది. చంద్రకుల్యానది మరి ఒక వైపు మళ్ళింది.

ఆ వార్త విని మిహిరకులుడు డదేపనిగా వికటాట్టహాసం చెయ్యడం మొదలుపెట్టాడు. అతడలాగ వెర్రినవ్వునవ్వడానికి కారణమేమో ఎవరికీ తెలియలేదు. అందరు అరిచేతులలో ప్రాణాలుపెట్టుకొని అతనివైపే చూస్తూ నిలుచున్నారు.

ఆ సమయంలో మిహిరకులుని హృదయంలో ఒక భయంకరమైన సంకల్పం బయలుదేరింది. ఆ కుమ్మరి స్త్రీ స్పృశించగానే ఆశిల కదిలింది. మిగిలిన శీలవతు లెందరు స్పృశించినా అది చలించలేదు. కనక ఆ స్త్రీలలో కుమ్మరి స్త్రీ మాత్రమే శీలవతి! మిగిలినవా రందరు పతితలే! అదీ అతని నిశ్చయం!

ఆ విధమైన దుస్సంకల్పం కలిగిన తరవాత అతను దాని ఔచిత్యానౌచిత్యాల విషయం ఒకమారుమంత్రులతోనైనా సంప్రతించలేదు!

వెంటనే ఆశీలవతులను, వారి తండ్రులను,

సోదరులను; కుమారులను అందరినీ నిర్దాక్షిణ్యంగా నరికించి వేశాడు!

అతను రాజ్యానికి వచ్చినది మొదలుకొని అంతవరకు మొత్తం మూడుకోట్లమంది మానవులను నిర్దాక్షిణ్యంగా సంహరించి వేశాడు. కాశ్మీర ప్రజలతనిని 'త్రికోటిహా' అని క్రూర బిరుదంతో పిలిచేవారట!

ఆ ప్రజ కౌదుష్టపరిపాలన సహించడం దుస్సహమైపోయింది. కాని ఆ హూణ దౌర్జన్యాని కెవ్వరు ఎదురొడ్డి నిలబడలేక పోయారు. దుర్దైవంకూడా మిహిర కులుని పక్షం వహించడమే దానికి కారణమని కల్హణ కవి రాజ తరంగిణిలో ఒక నిట్టూర్పు విడిచిపెట్టాడు.

## 3

క్రమక్రమంగా మిహిరకులునికి బాగా వయస్సు మళ్ళి వార్ధక్యం వచ్చింది. అతని మనశ్శరీరాలాధివ్యాధులతో కుళ్ళి కృశించిపోయాయి. ఆ వయస్సులో ఎలాంటి దుర హంకారపూరితులకైనా కొంచెం పాప భీతి, దైవచింత కలగడం సహజం! మిహిర కులుడంతటి క్రౌర్యమూర్తికి పశ్చాత్తాపం కలగడంలో ఆశ్చర్యం ఏమి ఉంది!

మిహిరకులుని వంశీయులైన హూణు లెన్నెన్నో బౌద్ధవిహారాలు నేలమట్టం చేశారు. కాని హూణులలో చాలామంది శివభక్తులు.

మిహిరకులుడు కాశ్మీర దేశంలో స్వయంగా మిహిరేశ్వర ప్రతిష్ఠచేసి మిహిరేశ్వర దేవాలయం నిర్మించాడు. తన పేరట ఇంకొక అగ్రహారంకూడా వెలయింపజేశాడు.

అతనికంతమాత్రంచేత సంతృప్తికలగలేదు. ఇంకా వేలకొలది అగ్రహారాలు బ్రాహ్మణుల కర్పించవలెనని నిశ్చయించాడు. కాని సాంప్రదాయికులైన కాశ్మీరబ్రాహ్మణు లతని సంకల్పం వినీవిననట్టుగా మాట్లాడకూరుకొన్నారు. అంతేగాని అతని దుర్దానాలు స్వీకరించి తమ కుటుంబాలు పోషించుకోడాని కిష్టపడలేదు!

ఆ సంగతి మిహిరకులుడు కొంచెం ముందుగానే పసిగట్టివేశాడు. అందుచేత ప్రత్యేకంగా గాంధారదేశంనించి వందలాదిబ్రాహ్మణులనుపిలిపించి వారి పేరట గాంధారదేశంలో ఎన్నెన్నో అగ్రహారాలు దానంచేశాడు. ఆ బ్రాహ్మణు లతనికి అన్ని విధాలా తగినవారేనని కల్హణుడు రాజతరంగిణిలో వారినందరినీ ఆక్షేపించాడు. ఇక మిగిలిన కాశ్మీర బ్రాహ్మణులమాట వేరేచెప్పనే అక్కరలేదుగదా!

మిహిరకులుని హృదయంలో పశ్చాత్తాపాగ్ని నానాటికీ బాగా రాజుకుంది. క్రమంగా కాశ్మీరప్రజ కతనిదర్శనమే కరువైపోయింది. కాని కాశ్మీరంలో దానికి విచారించేవారెవరు కనిపించలేదు.

ఒకనాడు మిహిరకులుడొక గొప్పహోమ వేదిక సిద్ధంచేయించవలసిందని మంత్రులందరికి ఆజ్ఞాపించాడు. ఆ వేదిక పైపను నైనకత్తులు నిలువుగా పాతించవలసినదని ప్రత్యేకంగా నొక్కిచెప్పాడు.

ఆ వేదికలో అగ్నిహోత్రజ్వాలలు వాడికత్తులవలెనాల్కలల్లల్లాడించాయి. వాడి కత్తుల్లా వేదికలో అగ్నిహోత్రజ్వాలల్లా అత్యంత భయంకరంగా తళతళలాడాయి.

కాశ్మీరమంత్రులెవరికీ ఆ వేదిక అలాగ తయారుచేయించడానికి గల కారణం తెలియలేదు. మళ్ళీ శ్రీనగరవాసులందరికీ ఏదో మహోపద్రవం రానున్నదని మంత్రులే కాక ప్రజలంతా హడలెత్తిపోయారు.

అంతలో మిహిరకులుడక్కడికి వచ్చాడు. వెంటనే పరిచారకులు కొందరా అగ్నిహోత్రజ్వాలలో ఆజ్యధారలు గుమ్మరించారు జ్వాల లొక్కమారుగా ఉవ్వెత్తుగా పైకిలేచాయి సదస్యులందరికీ ఆ జ్వాలలు చూడగానే కళ్లకు మిరుమిట్లుగొల్పాయి.

మిహిరుకులు డొక్కక్షణకాలం ఆ జ్వాలలవైపు చూచాడు. ఉత్తరక్షణంలో కళ్లు మూసుకుని ఆ జ్వాలలలో ఉరికాడు.

అతని రాక్షస సాహసం చూచిన మంత్రులు, కాశ్మీరప్రజలు ముక్తకంఠంతో హాహాకారాలు చేశారు. వారందరు కొంచెం తేరుకునేసరి కతనిశరీరం ఆ భయంకరాగ్ని జ్వాలలలో కాలి భస్మావశేషమైపోయింది!

మిహిరకులుని దౌర్జన్యంఅతడు జీవించి ఉన్నంతకాలము కాశ్మీరంలో అప్రతిహతంగా సాగిపోయింది. చివరి కతని జీవితం కూడా అతనిదౌర్జన్యాని కాహుతి అయి భస్మమైపోయింది.

ప్రాచీనకాలంలో శ్రీకృష్ణుని పౌరాణికసూక్తి ఉల్లంఘించి కాశ్మీర రాజ్యం కబళించిన హూణుల దౌర్జన్యం మిహిరకులుని అగ్నిప్రవేశంతో ఆ విధంగా నామమాత్రావశేషమై పోయిందనీ దైవ నిర్ణయం ఎవరు తప్పించలేరనీ కాశ్మీరప్రజ లనేకవిధాలుగా అతనిమీద దుమ్మెత్తి పోశారు.



# సంక్రాంతి సఖ్యం

నిత్యానంద్

దేవతార్చన చేస్తున్న పేరయ్యకు వళ్లు మండిపోయింది. ఇక్కడ నైవేద్యాని కేదీ పడీదుకదా అని ముఖం చిట్లించుకుని 'ఏమేవ్! ఇలారా' అని భార్య కామాక్షిని పిలిచేడు.

'లేడికి లేచిందే ప్రయాణం' ప్రతీదానికీ వేపుకతినడమే' అని గొణుక్కుంటూ 'ఏమిటండీ కావాలి?' అని ప్రశ్నించింది కామాక్షి.

'పాలు పంచదార యిలాగ తగలెయ్ నైవేద్యానికి' అన్నాడు పేరయ్యకోపంగా.

"పాలు ఎక్కడివి? కాఫీకే లేవు రామిగాడి గేదె తన్నేసిందట"

"అయితే పంచదారే పడేయ్. యేం చేస్తాం?"

కామాక్షి పంచదార తేడానికి వెళ్ళింది. పేరయ్య 'ఓం నమశ్శివాయ' అంటూ జపం చేస్తున్నాడు. కామాక్షి పంచదారయిచ్చి 'అలాగ ఏరైతుదగ్గరకైనా వెళ్ళి కూరలు తెండి. పండుగనాటికి కూరలు ఉండాలి' అంది.

'అలాగే లే!' అని సమాధానమిచ్చి మళ్లీ 'ఓం నమశ్శివాయ' అని అందుకున్నాడు పేరయ్య.

కామాక్షి నడవలోకి వెళ్ళి, తిరిగివచ్చింది "ఏమండీ పనసకాయ కొట్టించాలి. బత్తుడికి కబురంపండి" అంది.

'అబ్బబ్బ! మాట తోచనివ్వదు. నేను రామా కృష్ణా అనుకునేటప్పుడే యివ్వన్నీ గేపకంవస్తాయి నీకు' అని కోపగించుకుంటూ లేచి వీధిలోకివచ్చి కూర్చున్నాడు పేరయ్య.

'దండాలు బాబూ దండాలు' అంటూ వచ్చేడు రామునాయుడు.

'రామన్నా! పనసకాయ చెక్కడానికి వీరేసుని పిలవాలి'

"ఎవ్వరైనావస్తే పంపుదాం లెండి" అన్నాడు రామన్న.

ఇంతలో ఆ త్రోవంట "చెలియా కన రావా, నిరాశబూనిపో.. యెదవా" అని పాడుతూ గేదెల్ని తోలుకపోతున్న వెంకడిని పిలిచి, 'వీరేసుని పేరయ్యగారు పిలుస్తున్నారని చెప్పు' అని పురమాయించేడు రామన్న.

'గేదెలు చేలోకి పడతాయి' అన్నాడు వెంకడు.

'నేను చూస్తాను. నువ్వెల్లి వీరేసుని పిలుచుకునిరా' అని వాడిని పంపించేడు రామన్న.

పావుగంటయినా వెంకడు తిరిగిరాలేదు. రామన్నకు చిరాకేసింది. యీగుంటయెదవ అల్లీలాడుకుంటున్నాడుగాల. నాకీ గేదెల్ని అప్పజెప్పేడు?' అని రామన్న నిట్టూరుస్తుంటే వెంకడు తిరిగొచ్చి, 'వత్తాడటండీ' అనుకుంటూ గేదెల్ని అటకాయిస్తూ 'డడడా, డడడా' అని పాడుకుంటూ వెళ్ళిపోయేడు.

'రామన్నా! చూసేవా? సినీమాలు యీ గుంటల్ని ఎలాగ పాడుచేస్తున్నాయో' అన్న పేరయ్య మాటలకి 'చిత్తం' అని వెనకపాట పాడేడు రామన్న.

'ఈ వీరేసు కెంతపొగరురా! పనసకాయ కొట్టడానికి తర్వాత వస్తాడట' కాలం మారింది' అన్నాడు పేరయ్య.

'దానిమాటకేంగాని, బాబూ! బట్టి కాలవ మీదికెళ్లి లేదా? అక్కడ యీ పాటికి మీ రైతు లక్ష్మయ్యకీ, చినరాముడికీ రామ రావణయుద్ధం అవుతుంటాది' అన్నాడు రామన్న.

ఆం.. ఆం. నీటిసురించే? ఎందుకు ఆ దెబ్బలాట? నాకు తెలియదే! అయితే అలాగ వెళ్లివస్తానుండు' అని ఆత్రంతగా ఓళ్ళగోచీ సవరించుకుంటూ బయలుదేరేడు పేరయ్య.

* * *

లక్ష్మయ్య పేరయ్యగారి రైతు. రాముడు స్వంతసాగు చేసుకుంటున్నాడు. రెండు భూములూ ఒకదానిప్రక్క ఒకటిఉన్నాయి. నీటి కాలువ ప్రక్కనే ఉంది. ఆరోజునీటి వంతు వాళ్ళిద్దరిదీని. ముందు నేనంటే, నేను అనివాదించుకున్నారు లక్ష్మయ్య తెల్లవారకుండా నే వచ్చి తనమడిలోకి నీరు వదిలేడు. ఇంతలో రాముడువచ్చి, మట్టిపెల్లతీసి కాలవ కడ్డంగా పెట్ట 'అపసాం' మార్చి తనమడిలోకి పెట్టేడు నీరు.

"ఓరీ రాముడా? నామడి కెట్టుకుంటే నీ రాపుతావేంరా?" అని కేకేసేడు లక్ష్మయ్య.

"ముందు నామడికి నీరెట్టుకుంటాను? నువ్వంత మొగాడివా" అని జవాబిచ్చేడు రాముడు.

"ఓరి నాయనా! కలకిటేరులాగ మాటాడుతున్నావోయ్" అన్నాడు లక్ష్మయ్య వేళాకోళంగా!

మాటకి మాటా పెరిగి నువ్వెంతంటే నువ్వెంతన్నదాకా వచ్చింది. "నామడిబాగా ఎండిపోయింది. దానికి ముందునీరుకావాలా? నీమడికా?" అంటూ దగ్గరకొచ్చి "మాబుగతనే తీసుకొత్తానుండు"అన్నాడులక్ష్మయ్య.

"మీబుగతొవస్తే ఎవడికి భయం? రమ్మను ఏటిచేస్తాడో?" నిర్లక్ష్యంగా జవాబిచ్చేడు రాముడు.

అమాటతో లక్ష్మయ్యకి కోపంవచ్చింది. "మునిసీబువన్నాడనిరగఇబడుతున్నావు. మునిసీబు ఎలుముద్రబాపతు. అన్నీమాబుగతే రాయాలి!" భయపెట్టేడు లక్ష్మయ్య.

"ఆ! యెల్లు యెల్లు" నిర్లక్ష్యంగా అన్నాడు రాముడు.

"ఉండు. మీ మునిసీబు సంగతేదో కనుక్కొంటాను. ఒక్క నెక్క కూడా మాబుగతరాయకపోతే, తెలుత్తుంది మీ మునిసీబు సంగతి అలాగైతే ఎల్లుండికల్లా నాగలొట్టుకుని భూమిదున్నకా మీ మునిసీబు" అంతా వాళ్ళ బుగతచేతిలోనే ఉన్నట్టు మాటాడేడు లక్ష్మయ్య.

రామయ్యకి కోపం ఎక్కువైపోయింది. "మీ బుగత లేకపోతే మరి బతకలేరా? రమ్మను మీ బుగతని మునిసీబెందుకు నేనే సూత్తాను" అన్నాడు కోపంగా.

బుగత పేరెత్తగానే లక్ష్మయ్యకి కోపం రెట్టింపయింది. "ఏంచేత్తావురా మాబుగతని" అన్నాడు.

రామయ్య కందగడ్డలా ముఖంచేసుకుని, "ఏంచేత్తానా? ఆ పిల కొట్టుకుని, గంటి పిలకల్ని దుల్లిగొట్టినట్టు దుల్లిగొట్టేత్తాను! రమ్మను" సవాలు చేసేడు.

లక్ష్మయ్యకి, తన బుగతను అనడంతో వళ్లుమండిపోయింది. "అయితే మేమేనాద చేతగానివాళ్లం? మీ మునిసీబుని ఎత్తి కుగొట్టి 'కోడిపెట్ట నులిపినట్టు నులిపి పారేనా?" అన్నాడు మీసం మెలివేస్తూ.

రామయ్య కోపంతోకూడిన వెటకారంతో "ఏడిసినావ్ లే! మీ బుగతని దుమ్మొలి రిసి వోగయ్యానా?" అన్నాడు.

"మీ మునిసీబుని కాళ్లు రెండూ పట్టుకుని గిరగిర తిప్పి కరణంగారి మోటబావిలో కిసిరనా?" అన్నాడు లక్ష్మయ్య.

మీసాలు మెలివెయ్యడం తొడచరుపుల దాకొవచ్చింది. యింతలోకి పేరయ్య పరుగెత్తుకుంటూ వచ్చేరు.

ఈ దెబ్బలాట యిలాగ సాగుతున్నంతలోనే రాముడి మడి సగం కలిసిపోయింది.

పేరయ్యగారికి వీళ్ల దెబ్బలాటలో ఆఖరి మాటలు వినిపించేయి.

"ఒరేయ్! మీ రిద్దరూ దెబ్బలాడుకుని నాకూ మునసబుకే కయ్యం పెట్టకండి" పేరయ్య వారిద్దర్నీ చూసి అన్నాడు.

"మాడండీ! నీరు యియ్యడు" అని ఫిర్యాదు చేసేరు లక్ష్మయ్య.

"వాడిదప్పుడే సగం కల్సిపోయింది కదుట్రా! యింకో గంటలో పూర్తిగా కల్సిపోతుంది. సాయంత్రంవరకూ నువ్వేతీసుకో నీరు. దానికి దెబ్బలాట యెందుకు?" అని రాజీపర్చి, "రేపటికి కూరలు కావాలి. వంగ పింజలు పట్టుకెళ్లు" అని లక్ష్మయ్యను పురమాయించేరు పేరయ్య.

యిలాంటి తెలివితక్కువవల్ల పెద్దాళ్లకు తగువులొస్తాయి అనుకుంటూ తోటలోకి వెళ్లేరు పేరయ్య.

*　　　*　　　*

పట్నంపోయే రాచబాటకి అరమైలు దూరంలోఉంది ఆ ఊరు. ఆ స్థలంలో రెండు డబ్బా కాఫీదుకాణా లున్నాయి. ఊరిలోని పిన్నాపెద్దా సాయంత్రం పనులు ముగించుకుని అక్కడికివచ్చి టీ త్రాగి, పిచ్చాపాటి వేసుకుంటూంటారు. బస్సుల ట్రాఫిక్ ఉండడాన్ని వాళ్లి బేరాలు బాగానే ఉంటాయి

పేరయ్య తోటను చూసి, ఆ దుకాణాల దగ్గరికొచ్చేరు. అప్పుడే బస్సువచ్చి ఆగింది. కాఫీదుకాణం యజమాని అప్పలస్వామి బస్సుదగ్గరికొచ్చి, 'వేడి వేడి కాఫీ, టీ' అని అరుస్తున్నాడు రెండవ దుకాణంవాడు కూడా వచ్చి "కాఫీ కావాలా బాబూ! తాగిచూసినాక డబ్బివ్వండి! టీ అణా! బలే సౌకబేరమూ" అని హుషారుగా కేకవేస్తూ ప్రతీవాళ్ళనీ అడుగుతున్నాడు అంత బేరం తనకే రావాలన్నట్టు. అప్పలస్వామిమాత్రం తక్కువ తిన్నాడా?

"పకోడా! బూంధీ! వేడియిడ్లీ! చూస్తే లాభంలేదు. తింటే తెలుస్తుంది. పట్నమెళ్లినా యిలాటివి దొరకవు" అని గట్టిగా కేకవేస్తూ, వారంరోజులనాటి పకోడీ, బూంధీ, ఐస్ముక్కలాగఉన్న యిడ్లీ చూపి

బస్సులోనుంచి 'టీ పట్టుకరా' అన్న మాట వినిపించగానే యిద్దరూ రెండు గ్లాసులతో డబ్బా టీ పట్టుకుని వెళ్లేరు. నన్ను తెమ్మన్నారంటే, నన్ను తెమ్మన్నారని వాళ్లిద్దరూ దెబ్బలాడుకుంటుంటే బస్సు లాగించీసేడు డ్రయివరు. యిద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకుని వెళ్లిపోయేరు.

ఆ బస్సులోనుంచి పేరయ్యగారి అల్లుడూ కూతురూ దిగేరు. వాళ్లని పలకరించి, సామాను యింటికి పంపించి, కుశల ప్రశ్నలతో యింటికి తీసుకొచ్చేరు.

భోజనాలైనతర్వాత పేరయ్యగారు వీధిలో యీజీచైరులో కూర్చుని చుట్టకాల్చుకుంటుంటే, మునసబు చంద్రినాయుడువచ్చి 'దండాలు బాబూ' అంటూ అరుగుమీద కూర్చున్నాడు. కొన్ని మాటలాడుకున్నారు.

"చూసేవా నాయుడూ! వీరేసుకెంత పొగరో పవసకాయకొట్టడానికి రమ్మంటే రాలేదు" అన్నాడు.

"మీరు రమ్మంటే నేరానన్నాడా? ఏం గోరోజనం? రేపు మేము పిలిపిస్తే పలుకుతాడా? తీసిపెట్టి వయ్యలేపొ్వ యేరా? ఆడిబాబుతో చెప్పకునేలాగ" అన్నాడు మునసబు.

ఇంతలో వచ్చేడు వీరేసు. పేరయ్య కోపంగా ఇప్పుడా తీరుబాటయింది! కళ్ళు నెత్తికెక్కాయా? అన్నాడు.

"తీరి కుండొద్దటండీ? ఆలస్యమైనందుకే కళ్లు నెత్తికెక్కాయి అంటారా?" అన్నాడు వీరేసు కోపంగా.

పేరయ్య పళ్లు కొరుకుతూ 'కోపంకూడా నట్రా?' అంటూ లేచివెళ్ళి ఈ చెంపా ఆ చెంపా వాయించేడు.

వీరేసు చిన్న ముఖం చేసుకుని వెళ్ళిపోయేడు.

అక్కడే ఉన్న మున్సబు "మంచి పని చేసేరు. వాళ్ళకలాగ చేస్తేనేగాని బుద్ధి రాదు" అని వెనక తాళంవేసేడు.

పేరయ్య కోపం కొంతతగ్గగానే "బాబూ మన ఊరు తీర్థం గదా ముక్కనుమునాడు. మరి ఏర్పాట్లు చెయ్యాలా?" అడిగేడు మునసబు.

"ఈ యేడు ఘనంగా సెయ్యాలి. వీలైనన్ని, భజనలు, దాశరికాలు, బొమ్మలాటలు హారికథలు కూడా ఏర్పాటు చెయ్యాలి." అన్నాడు పేరయ్య.

"చిత్తం నేను సెలవు తీసుకుంటాను" అని మునసబు లేచి వెళ్లిపోయేడు.

*　　　*　　　*

వీరేసు నాగలికి పన్నువెయ్యడానికి ఇనప ఊచ కొలిమిలో పెట్టి ఊదిసాగగొడుతున్నాడు

'ఏతం మీట' విరిగి పోయింది, వెయ్యాలి అంటూ చంద్రినాయుడు అక్కడికి వచ్చేడు

# ★ సంక్రాంతి సఖ్యం ★

'దానికేంగాని, నాయుడు మాఁవా! ఆయేల పేరయ్యగారు కొడుతుంటే, నువ్వు దగ్గిరుండే ఊరుకున్నావుగదా బాగుందా! ఇంతకీ నాతప్పేటి? కొంచెం ఆలస్యమైందనేనా! దొడ్లో అచ్చయ్యదొని సెక్కమంతే చెక్కుతున్నను కాకోళ్ళకర్రోడు వచ్చి, నాగలిరిగిపోయింది వస్తావా సస్తావా అని కూకున్నాడు. ఎంపాడప్పన్న, బండి దెబ్బతింది రమ్మన్నాడు. ఎక్కడికెల్లిది? ఎన్ని సేతులున్నాయి! చెప్పు. అని నిలదీసేడు మునసబుని.

"నువ్వు సేతగాక ఊరుకుంటే నేనేం సేత్తాను? ఒకటికొడితే నాలుగు తిరిగి యెయ్యసేవా! సేతగాక ఊరుకుని ఇప్పుడు నన్నంటావు! ఇప్పుడైనా బాధలేదు. వెంటనే కేసు పడీ! తర్వాత సూద్దాం నడు" అని ప్రోత్సాహమిచ్చి పురి ఎక్కించేడు.

"అమ్మో కేసే! కోర్టు కొలపడానికి డబ్బేదీ" అంటూ గుండె పట్టుకున్నాడు వీరేసు

"నీకా డబ్బాసు ఎందుకు? నేనున్నాను గదా! లేకపోయినా మనోళ్లంతా సర్దుబాటు చేస్తారులే! నమ్మకం చెప్పేడు మునసబు. ఇంతలో కర్ర భుజం మీదేసుకుని రామన్న అక్కడికొచ్చేడు. 'ఏటి నాయుడుమాఁవా ఇక్కడున్నావ' పలకరించెడు మునసబు రామన్న.

"ఏంలేదు. ఏతం మీట యేయిద్దామని వచ్చేను. పంతులుమీద కేసు పడీమంటే డబ్బులేదని బెగులుతాడేం వీరేసు" సలహా చెప్పమన్నట్టు చూసేడు మునసబు.

"అదేమయ్యా, నువ్వు గెలుచుకుంటే నీ ఖర్చులు పంతులు ఇచ్చుకోడా? అందాకా అప్పోసప్పో సెయ్యాలి. అంత అవుసరమైతే మే మూరుకుంటామా?" అని ధైర్యం చెప్పి "ఏం నాయుడు మామా?" అంటూ గర్వముగా చూసేడు మునసబువేపు. అలా నేనని తలూపేడు వీరేసు.

లక్ష్మయ్యతో తగవయిననాడే రామన్న మునసబు దగ్గిరికెళ్ళి పేరయ్య రైతుచేత మున





సబుని తిట్టించేడనీ, అతను లెక్కలు రాయక పోతే నవ్వేందుకూ పనికిరావనిపించే డనీ, ఉన్నవీ లేనివీ పోగుచేసి పురెక్కించేడు. మునసబు అప్పటినుంచి శాస్త్రిమీద పగతీర్చు కోడానికి ప్రయత్నిస్తున్నాడు. అదును దొరకగానే వీరేశుకి పురెక్కించి తాసెటూ చెందని వ్యక్తిలా వ్యవహరిస్తున్నాడు.

భోగి రేపనగా పేరయ్యకి సమనొచ్చింది కోర్టుకి హాజరుకావాలని. పండుగబట్టలు కొనడానికి ఎలాగా వెళ్లాలి. ఇది కలిసిందని అనుకుని బయలుదేరేడు.

పనులన్నీ చూసుకుని యింటికి వచ్చేడు.

వీరేశుకి సరిగ్గా ఆ రోజుకే చేతిలో డబ్బు అయిపోయింది. ఎక్కడా పుట్టింది కాదు. అడుగులోనే పిడుగేమిటో అనుకుంటూ, విధిలేక బాడిద పట్టుకెళ్లి తాకట్టుంచి తెచ్చేడు డబ్బు. మునసబుని తీసుకుని వెళ్లేడు. మునసబుకి తెలిసిన ఒక లాయర్ని కుదుర్చుకుని తిరిగివచ్చేడు యింటికి.

ఆరోజు భోగి. తెల్లవారిసరికి పేరయ్య గారింట్లో అందరూ నలుగులు పెట్టుకుని స్నానాలుచేసి కాఫీలు సేవించి క్రొత్త బట్టలు వేసుకుని తయారయేరు.

ఊళ్ళో కొందరు తగు మనుషులు వచ్చి పేరయ్యగారి అరుగుమీద పేకాట వేశారు. పేరయ్యఅతనిఅల్లుడూకూడాకూర్చున్నారు.

ఇంతలో 'దాశరికం' వాళ్లు వచ్చేరు. కోలలో నూనె నిండుగాపోసి ముట్టించి, దాసుడు పాటపాడుతున్నాడు. మిగిలిన వాళ్లు వెనక "హరి హరి న్నారాయణా ఆదినారాయణా! కరుణించి మమ్మేలు కమల లోచనుడా" అని వంతపాట పాడుతున్నారు. దాసుడు శివమెత్తినట్లు కోలలు తిప్పి పాడు తుంటే నిజంగా వాడికి దేవతో దెయ్యమో పూని ఉంటుందని ఆశ్చర్యంగా చూస్తు న్నాడు పేరయ్యగారి అల్లుడు.

పేరయ్యగారు వాళ్లను పంపించేసేరు. వాళ్లు వెళ్లేసరికి 'చెక్కభజన' వాళ్లు వచ్చేరు.

సినీమాలో చేస్నులాగ వాళ్లంతా గుండ్రంగా నిలువబడి, ముందుకీ వెనక్కీ అడుగు వేస్తూ"

"అడవిలో సీతమ్మ... హా! రామాయను చును అన్నాను నిదుర లే—కున్నాది పది నెలలూ!" అని రామాయణంలో భాగం గానం చేస్తున్నారు.

ఆ దాశరికంకంటే యిద్దో కొంతనయం! వినడానికి యింపుగా ఉంది అన్నాడు పేరయ్యగారి అల్లుడు.

ఇంతలో కొమ్మదాసరి, వీణమీటుతూ, శిష్యుడికి జోలెనిచ్చి 'తందానతాన' పదం పాడుతూ వచ్చేడు. ఇది రమారమి బుర్రకథ అలా ఉంటుంది. ఏమైనా యివన్నీ సినీమా లకి దిగువే!" అన్నాడు పేరయ్య.

అంతలోనే పేరయ్యగారి గొడ్లకాపరి "అమ్మో ప్రేమా! ప్రేమా! అమ్మో ప్రేమా!" అని పాడుకుంటూ పోతున్నాడు.

"చూడవోయ్! పదేళ్ల వయసు నుంచీ ప్రేమ యిలాగ మొలకలెత్తుతుంటే, సినీమాల ప్రభావం తెలుస్తున్నాదా?" అన్నారు పేరయ్యగారు అల్లుడితో.

అంతవరకూ ఆపేకాట చూస్తూకూర్చున్న పైడితల్లి లేచి పేరయ్యగారి మాటల్ని బల పరుస్తూ "నిజమే బాబూ! సినీమాలు నూసిం దగ్గిర్నుంచీ పనిపాట్లు మానీసేరు. సినీమాల్లో "ఏక్టేర్లు" (Actors) అయిపోతారట ఒక్కొక్కడూను. ఏం కాలం!" అను కుంటూ యింటికి పొయేడు.

అమర్నాడు సాయంత్రం వరకూ భజనలు దాశరికాలూ, దాసర్లు, బిచ్చగాళ్లు లెక్క లేకుండా వస్తునే ఉన్నారు. కనుము పండుగనాడు బళ్లపండుగ కాబట్టి బళ్లన్నీ కడిగి పసుపు కుంకుమతో బొట్టుపెట్టి ఆవుల్ని ఎడ్లని శుభ్రంగా నీటిలో కడిగి, ముఖాన్ని పసుపు కుంకుమలు రాసి పూజ చేసేరు.

మర్నాడు అత్తూరిలో తీర్థం. రకరకాల దుకాణాలూ తినుబండారాలు వస్తాయి. వీటిన్నింటినీ తగిన విధంగా ఏర్పరచడానికి పేరయ్య మున్సబు మొదలైన వాళ్ళంతా వెళ్లేరు. తినుబండారాల దుకాణాలన్నీ వరు సగా ఒకలైనులో వేయించేరు. కిళ్లీ దుకా ణాలు, సోడా దుకాణాలూ, మరొక వరు సలో వేసేరు. దాశరికాలూ, భజనలు యిం కొకమూల ఏర్పరిచేరు.

బారెడు పొద్దు ఎక్కేసరికి అన్ని వింతలూ అక్కడే ఉన్నాయి. భజనలు ఒకమూలని ఏర్పాటుచేసేరు.

రంగులరాట్నాలు ఇంకొకప్రక్క వేసేరు. కోడిపందేలు, గొర్రెల పందేలూ ఒకప్రక్క వేశారు. మధ్యలో తినుబడి పదార్థాలూ, బొమ్మలూ అన్నీ ఉన్నాయి. ఇసకవేస్తే రాలకుండా ఉన్నారు మనుష్యులు.

ఆ మధ్యను నిలబడితే చెవులు గింగురు లెత్తుతాయన్నట్టుంది గోల. భజనలు కొందరు చూస్తున్నారు. కోడిపందేలు కొందరు, రంగులరాట్నాల దగ్గర కొందరూ యిలాగ ఎవరికి తోచిన దగ్గర వారు ఉన్నారు.

(తరువాయి పేజీ చూడండి)

# దీని భావమేమి

టి. నిర్మల

సినిమున్నా ఒక సీసపద్యం విన్నాను. పద్యం బాగున్నదని బట్టీపట్టాను. కాని దానిభావం తెలియలేదు. ఎంతమందినో అడిగాను. కాని ఎవరూ చెప్పలేక పోయినారు. ఆ పద్యం యిది:

సీ॥ నన నన వనములో నేనున్న కోనలో
మంగళగిరిమీద మర్రిచెట్టు.

చెట్టుకు కొమ్మలు చేరిన పదివేలు
కొమ్మ కొమ్మకు వెయ్యి కోతులుండు.

నవతరంబైనట్టి నడికొమ్మ మీదను
నక్క ఒకటున్నది చుక్కవలెను.

చుక్కకు తూర్పున సూర్యచంద్రాదులు తేజరిల్లు—

దీని కర్థంబు చెప్పెడి మానవులకు
నెలలు పన్నెండు దినములు గడువిత్తు,
చెప్పగలిగిన భావజ్ఞ చక్రవర్తి
చెప్పలేకున్న నగుదునే చిన్నినగవు—

దీనిభావం తెలిసినవారెవరైనా 'ఆంధ్రపత్రిక' (వారపత్రిక) ద్వారా తెలియజేయ ప్రార్థితులు.

# ఓటు అ

# వెళ్లిపో

# ఎలక్షన్



ఏలూరు లోక్ సభ నియోజకవర్గంలోని తాడేపల్లిగూడెంలో 11వ తేదీన ఓటుచేయడానికి వచ్చిన స్త్రీలు

పత్రం, పుష్పం, ఫలం, తోయం ఏదిచ్చినా భక్తితో ఇస్తేచాలు, భగవంతుడు స్వీకరిస్తాడు. కాని ఎన్నికల దేవుడు భక్తితో ఇచ్చినా ఊరికే ఇచ్చినా ఓట్లు మాత్రమే తీసుకుంటాడు

ఈసంగతి తెలియని ఒక ముద్దరాలు ఓటు చెయ్యడానికి వెళ్లి బాలట్ పెట్టె ముందు కూర్చుని ప్రార్థన చెయ్యసాగిందట ఇది ఔరంగాబాదు జిల్లాలో జరిగింది ఓటు చెయ్యడానికి వెళ్లి ఇంతసేపుంది ఏమిటా అని పోలింగ్ అధికారి లోపలికివెళ్లి చూచునుగదా, ఆమె ఓట్లపెట్టెమీద పువ్వులువేసి, కుంకంపూసి, పెట్టెలో కొన్ని ధాన్యంపోసి ధ్యానంలో కూర్చుంది ఏమిటమ్మా ఇదంతా అని అధికారి అడిగితే పంటలు బాగా పండాలని పూజ చేస్తున్నా నన్నది

నెలరోజులుపైగా దేశమంతటా జరిగిన ఎన్నికలలో ఇలాంటి వింతలు, విశేషాలు ఎన్నో జరిగాయి

అయిదేళ్లకొకసారి వస్తుంది ఎన్నికల పండగ ఈపండగ వస్తోందనగానే రకరకాల రాజకీయ పక్షాలవారు రంగులు, వేషాలు వేసుకుని రంగంలోకి దిగుతారు. "ఓటు లివ్వండోయి బాబూ" అనేపాట ప్రతి నాయకుడి నోటా వినిపిస్తుంది కొంతమంది హఠాత్తుగా రంగు మార్చుకుని ఇంకోరంగు వేసేసుకుంటారు. మొత్తంమీద ఎన్నికలై పోయి మంత్రివర్గాలు ఏర్పరచే టైముకేగాని ఎవరి జేరంగో బయటపడదు ఎన్నికలలో నిలిచిన ప్రతివాడికీ ఎన్నికలు పండగ కావు గెలిచినవాడికే పండగ. ఓడినవాడికి దండగ. ఓడిపోయిన వాడి ముఖం ఎంతమందిలో ఉన్నా ఇట్టే కనిపెట్టెయ్యవచ్చు అందుకే కొన్ని దినాలుగా ఉన్న వాళ్ళి [illegible] డిపాజిట్లు పోయినవాడి [illegible] అని పరాచికాలాడ్డం తెలుగుదేశంలో విన

డిపాజిట్లు పోవడమంటే ఎక్కడికి పోతుంది? ప్రభుత్వ ఖజానాలోకే. ధరావతులు గల్లంతైన వాళ్ళు కొల్లలుగా ఉన్నారు గనుక, ఆ వచ్చిన డబ్బుతో ప్రభుత్వం ఒక చిన్నసైజు ప్రాజెక్టో, ఫ్యాక్టరీయో కట్టుకో వచ్చు

## ఓట్లకి బదులు నోట్లు

పాపం కొందరు అమాయక ఓటర్లు ప్రభుత్వానికి ఇంకొంత ధనసహాయం చేద్దామనిపించింది కాబోలు, అంబాలా నియోజకవర్గంలో ఏంచేశారటా—ఓట్ల పెట్టెల్లో కొన్ని డబ్బుకూడా పడేశారట ధర్మడబ్బీలలో డబ్బు వెయ్యడం అలవాటైన పుణ్యాత్ములై ఉంటారు కాంగ్రెసు పెట్టెలో 4రూపాయి నోట్లు, ఓ బేడా కనిపించాయి జనసంఘం పెట్టెలో ఓ రూపాయి నోటూ, ఓ కాసీ కనిపించాయి 'మీఓట్లు మాకే' అని అభ్యర్థులు అరవడం విని 'మీ నోట్లు మాకే' అంటున్నారనుకుని కాయితప్పులా నోట్లు వేసిఉంటారేమో చివరికి వాటిని ప్రభుత్వం స్వాధీనపరుచుకుంది.

## సాలమన్ న్యాయం

వెనకటికి సాలమన్ రాజు ఒకశిశువు ఇద్దరు స్త్రీలలో ఎవరిదో తెలుసుకోడానికి, శిశువును రెండుగా నరికి చెరోటీ ఇవ్వమని ఆజ్ఞాపించాడట అలాగే అస్సాంలోని జార్హాత్ నియోజకవర్గంలో ఒక ఓటరిణి అక్కడ పోటీచేస్తున్న ఇద్దరు అభ్యర్థులు వచ్చి మీ ఓటు మాకిమ్మంటే మాకిమ్మని వేధించారల్లే ఉంది ఓటును రెండుముక్కలు చేసి, ఇద్దరి పెట్టెల్లోను చెరోటీ వేసింది. ఓటు కూడా శిశువులాంటిదేనని, రెండుగా చేస్తే రెంటికీ విలువపోతుందనీ ఆవిడకి తరవాత గాని తెలియ లేదు.

# ఆంధ్రప్రదేశ్ శాసనస



# ందానికి తోటని

# ఎన పెళ్లికూతురు

# తమాషాలనిషా



ఓటుచేయడానికి వృద్ధాప్యంగాని, అంధతగాని, అడ్డురాని ఆంధ్ర స్త్రీలు.

## ఓటు గుడ్డిదా?

ధారాపురంనియోజకవర్గంలో డెబ్బయ్యేళ్లి అంధురాలు ఎవరిసహాయం లేకుండానే కర్రమాత్రం పట్టుకుని సరాసరి పోలింగ్ దగ్గిరికి నడిచిపోయి ఓటువేసింది ఈవిడ పుట్టుగుడ్డి అయినా ఆమె ఎవరి సహాయమూ లేకుండానే ఊరంతా తిరుగుతూ ఉంటుంది ఊళ్ళో ప్రతివీధి, ప్రతిసందూ ఆమెకు కొట్టినపిండి పోలింగ్ అధికారి సహాయం కూడా లేకుండానే ఆమె ఓటు చేసింది ఎవరికి ఓటు చేసిందో తెలియదు గాని, అంత మరీగుడ్డిగా, ఓటుచేసి ఉండదని భావించవచ్చు

## ఓటుతోపాటు ఫోటో

నర్గీస్ పై అమోఘమైన మోజాగల ఒక ఓటరు మలక్ పేట (హైదరాబాదు) నియోజక వర్గంలో ఓటు వెయ్యడంతో తృప్తిపడక నర్గీస్ ఫోటో కూడా పెట్టెలో వేశాడు

## ముగ్గురికి మూడు ముక్కలు

హైదరాబాదులోనే మరో ఓటరు నిష్పక్షపాతంగా ఓటుచెయ్యాలనే కుతూహలంకొద్దీ బాలెట్ కాగితాన్ని మూడు ముక్కలు చేసి, పోటీచేస్తున్న ముగ్గురభ్యర్థుల పెట్టెల్లోనూ వేశాడు పక్షాలంటూ ఉన్నప్పుడు పక్షపాతాలు లేకుండా ఓటు చెయ్యడం ఎలాసాధ్యమవుతుంది?

## రాహుకాలం

తమిళులకు రాహుకాలం మీద పట్టింపు జాస్తి రాహుకాలంలో శుభకార్యమేమీ తలపెట్టరు కోయంబత్తూరులో మార్చి 11 వ తేదీన ఓటర్లనేకులు రాహుకాలం మూలంగా పొద్దునపూట పోలింగ్ కు రానేలేదు 9 గంటలు దాటినతర్వాత తండోపతండాలుగా స్త్రీపురుషులు వచ్చి వరుసగా నిలబడి ఓటు చేశారు రాహుకాలంలో ఓటుచేస్తే తమ అభిమాన అభ్యర్థి విజయం రాహుగ్రస్తమైపోతుందేమోనని వారంతా భయపడ్డారన్న మాట

తిరుప్పూర్ పట్టణంలో శతవృద్ధు (101 సం॥) ఒకడు అతి ప్రయాసతో వచ్చి ఓటుచేశాడు ఇలాగే దేశమంతటా శతవృద్ధులు, ఎందరో వచ్చి ఓటింగ్ హక్కును వినియోగించుకున్నారు ఓటుచెయ్యడానికి వృద్ధులైనా, యువకులైనా ఫరవాలేదుగాని, సుల్తాన్ బజారు (హైదరాబాదు) లో ఒక వింతజరిగింది అక్కడ నిలబడ్డ శ్రీ క్రిషన్ అనే పార్లమెంటు అభ్యర్థి వృద్ధుడు ఒక ఓటరు ఓటుచేయడానికి వచ్చి, "అయ్యా, తమరు వయోవృద్ధులు, ఇక పింఛను పుచ్చుకోవడం మంచిది" అని ఒక చీటీ రాసి పెట్టెలో పడేశాడు

## "అరణ్యమున హరీంద్రగర్జన"

కాని బెంగుళూరులో ఇంతకంటె పెద్ద వింత జరిగింది పూర్వకాలంలో కవులకు సంఘంలో అపార గౌరవం ఉండేది గట్టిగా దబాయించగల కవులకు రాజులు కూడా జడిసేవారు కాని ఇప్పుడు ప్రజలే రాజులు కవుల దబాయింపుల్నీ, దబ్బావాయింపుల్నీ ఖాతరుచేసేరోజులుపోయాయి బెంగుళూరులో స్వతంత్రుడుగా పోటీచేసిన హరీంద్రనాద్ చటోపాధ్యాయగారి పెట్టెలో ఒక ఆసామీ ఓ చీటీ ముక్క రాసిపడేశాడు "మీకు తగినది కవితా వ్యాసంగంగాని రాజకీయరంగం కాదని అర్థం వచ్చేలా అతడు సలహా ఇచ్చాడు [illegible] [illegible] కూడా అందులో చోటెక్కడ?

## రాజుల రోజులుకావు

## ...కు ఎన్నికైన మంత్రులు



...సవరాజు



కె వి నరసింగరావు



[illegible]

# ★ ఎలక్షన్ తమాషాల నిషా ★

జరిగినా ఓటింగ్ దగ్గరమాత్రం నవాబూ, గరీబూ భాయీభాయీ అనక తప్పదు. భవానీసాగర్ అనేచోట ఒకానొక జమీందారు అందరితో పాటువచ్చి "క్యూ"లో నిలబడి ఓటు చేయడం తనకు భంగమని భావించాడు. జనం తగ్గాకవెళ్ళి ఓటుచేద్దాం అని ఇంట్లోనే కాసుక్కూర్చున్నాడు. అరగంట అరగంటకీ నౌకర్లను జనం తగ్గారేమో చూసిరమ్మని పంపించాడు. క్యూలు పొడుగవుతున్నాయిగాని తగ్గడంలేదు. చివరికివిసుగుపుట్టింది. విధిలేక వచ్చి సామాన్య ప్రజలతో పాటు "క్యూ"లో నిలబడాడు. ఓ గంట దాటాకగాని ఆయనకి ఓటు చేసే ఛాన్సు రాలేదు. ఈ ఎన్నికలలో ఆయన నేర్చుకున్న దేమి టంటే "స్వామ్యవాదం" రోజు పోయి "సామ్యవాదం" రోజు వచ్చిందని.

## "దొందూ దొందే"

తాడిపత్రి తాలూకా ఊరచింతల గ్రామంలో అదేం చిత్రమో గాని ఒక్క ఓటైనా పోల్ కాలేదు. ఖాళీపెట్టెలు మాత్రమే వెనక్కి వెళ్లాయి. గ్రామస్థులు కమ్యూనిస్టుకూ ఓటు చెయ్యలేదు. కాంగ్రెసుకూ ఓటు చెయ్యలేదు

కమ్యూనిస్టుల పద్ధతి నచ్చక వారికి ఓటివ్వలేదట. కాంగ్రెసు కెందుకు ఓటివ్వలేదయా అంటే, ప్రభుత్వాని కెన్నిసార్లు మహజర్లు పెట్టుకున్నా గ్రామస్థులకు కావలసిన ఒక రోడ్డు వేయించలేదట, ఆస్పత్రి కట్టించలేదట. అందుకని కోపంవచ్చి ఎవరిళ్ళలో వారు కడుపులోచల్ల కదలకుండా కూర్చున్నారట

## "అంతా అందరే"

హిమాలయ ప్రాంతంలోని 14 గ్రామాలలో కూడా ఇలాగే ఖాళీపెట్టెలు తిరిగి వచ్చాయి. అయితే ఆ గ్రామాల ప్రజలు పోలింగ్‌కి రాకపోవడానికి వేరేకారణం ఉంది. ఎన్నికలకు ముందు ఒకొక్క పార్టీ




వారి రాకపోకలు, అవతలి పార్టీల వాళ్ళని దుష్ప్రచారం చెయ్యడం జరిగింది. పెద్దవాళ్ళ మీద, వాళ్ల ఇళ్లమీద, దుష్ప్రచారం పోసుకునేసరికి, చివరికందరి మీదా దుమ్ము దట్టంగా పేరుకుంది. అందుచేత అందరిమీదా అయిష్టం కలిగి 'అంతా అందరే' అనుకుని గ్రామస్థులు ఎవరికీ ఓటుచెయ్యడం మానుకున్నారు. ఆ గ్రామాల్లో 680 మంది ఓటర్లుండగా 9 ఓట్లే పోలైనాయట.

## ఎన్నికల బోను

అలహాబాదు జిల్లాలో ఒక గ్రామంలో 60 ఏళ్ల స్త్రీ ఒకామె తను ఓటుచేస్తే పాలాలు పోతాయని భయపడి ఓటుచేయడం మానుకుంది గ్రామస్థులంతా కలిసి తన పాలాలులాక్కోడానికే తనకు బాలట్ కాగితం ఇచ్చారని ఆమెనమ్మకం. "నీపాలాలకేమీ భయం లేదమ్మా" అని పోలింగ్ అధికారి ఎంత చెప్పినా ఆమె వినిపించుకోలేదు.

## ఓటు అందానికి లోటు

యు. పి. లోని ఫైజాబాద్ జిల్లాలో ఒకానొక సుందరికి ఆరోజునే పెళ్లికాబోతోంది ఓటుచెసి పెళ్లిచేసుకుందామని వచ్చింది. కాని ఓటుచెయ్యాలంటే చేతిమీద సిరాచుక్క వేయించుకోవాలి. పెళ్లికూతురికి బుగ్గమీద చుక్కఉంటే శోభిస్తుందిగాని చేతిమీద చుక్కఉంటే చుక్కెదురవుతుందేమోనని ఆమె భయపడి, ఓటు చెయ్యకుండానే వెళిపోయింది.

యు. పి. లోని సెయిల్ నియోజకవర్గంలో ఒక పోలింగ్ కేంద్రంలో 27 గురు స్త్రీలు ఓటుకాగితాల్ని బాలట్‌పెట్టెలపై ఉంచి వెళ్లిపోయారు. "ఓటు తల్లీ! మాకే లోటూ రాకుండా చూడు తల్లీ" అని ప్రార్థనచేసి ఓట్లు పెట్టెలో వేయకుండా వచ్చేశారు. తత్ఫలితంగా ఆ ఓట్లు చెల్లకుండా పోయాయి

## స్త్రీ సాహసం

కాని సహారన్‌పూర్ (యు. పి.) జిల్లాలోని మరొక స్త్రీ సాహసం మెచ్చుకోదగింది. జబ్బుగాఉన్న శిశువును బుజానవేసుకుని ఆమె క్యూలో నిలబడింది. "ఓటు చెయ్యకపోతే మునిగిపోయిందేమీ లేదు, ఇంటికిపోవమ్మా" అని ఎందరెన్ని విధాల చెప్పినా ఆమె "ఓటు చెయ్యందే కదల"నని నుంచుంది. చివరికా శిశువు బుజంమీదనే మరణించినా, ఆ స్త్రీ ఓటుచేసి మరీ తన దారిన వెళ్ళింది.

## వవ్వేరు వనితల ముందంజ

కున్న వవ్వేరు గ్రామం ఈసారి ఎన్నికలలో మరోవిధంగా ముందంజవేసింది. ఆడ ఓటర్లలో ఒక్కరుకూడా మానివెయ్యక అందరూ వెళ్లి ఓటువేసి వచ్చారు. దీన్నిబట్టి వవ్వేరు వనితలు రాజకీయంగా ఎంత చైతన్యం కలవారో గ్రహించవచ్చు.

## నెహ్రూ విజయం

ఫూల్‌పూర్ నియోజకవర్గంనుంచి ప్రధాన మంత్రి జవహర్లాల్ లక్షాతొంభై వేల ఓట్లకు పైగా మెజారిటీతో గెలిచారు. ఇంత పెద్ద మెజారిటీతో దేశంలో మరెవరూ గెలవలేదు. ప్రధానికి దేశంలో ఎంత పలుకుబడి ఉందంటే, బోలెడుచోట్ల ఓటర్లు 'మేము నెహ్రూ పెట్టెలోనే వేస్తాము' అని పట్టుపట్టారు. 'నెహ్రూగారు ఇక్కడ పోటీ చెయ్యడంలేదు. ఆయనపార్టీ మాత్రమే పోటీ చేస్తోంది' అని వారికి నచ్చచెప్పవలసి వచ్చింది.

ఫూల్‌పూర్ నియోజకవర్గంలోనే మార్చి 8 వ తేదీన అంధులైన వందమంది స్త్రీ పురుషులు వచ్చి పోలింగ్ అధికారి సాయంతో వోటుచేశారు.

మరోచోట ఒక వృద్ధుడు నేను 'లోకమాన్యతిలక్‌కే ఓటు చేస్తాను' అంటూ వచ్చాడు. మరోచోట 'నేను గాంధీజీకే ఓటు చేస్తా'నని మరో ఓటరు మొండిపట్టు పట్టాడు. ఇంకోచోట ఓటుహక్కులేని బాలుడొకడు ఓటుచేస్తానని మారాంచేశాడు.

ఇలాగ దేశమంతటా జరిగిన ఎన్నికలవింతలెన్నికలవో చెప్పలేము.

మనదేశంలో 20 కోట్ల దాకా ఓటర్లున్నారు వీరిలో సగంమందిదాకా స్త్రీలు. ఎక్కువమంది విద్యాగంధంలేనివారు. ఎన్నికలంటే ఏమిటో, వాటి ప్రయోజనం ఎంత విస్తృతమైనదో తెలియనివారు. అందుచేత పైన చెప్పిన విచిత్రాలు జరగడంలో ఆశ్చర్యంలేదు. కాని ఈ విచిత్రాలు అక్కడక్కడా చెదురుగా జరిగినవి మాత్రమేగాని, వీటినిబట్టి భారతీయుల రాజకీయ చైతన్యాన్ని అంచనా వేయడానికి వీల్లేదు. నూటికి 60, 70, 80, 90 వంతులుకూడా వోట్లు పోలైన ప్రదేశాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. వివిధ పక్షాలవారు చేసిన ప్రచారాలను, వేసిన ప్రణాళికలను తమ ధోరణిలో తాము అర్థంచేసుకుని మరీ ఓటుచేశారు ప్రజలు. వీరి దృష్టిలో ప్రతిపక్షమూ ప్రతిపక్షమే. ప్రతిపక్షమూ ప్రభుత్వపక్షమే. సమస్యలనుబట్టి, అభ్యర్థులనుబట్టి వీరు ఓటు చేశారనడంలో సందేహంలేదు. మన ప్రజల రాజకీయ చైతన్యం పాశ్చాత్యప్రజాస్వామ్యాలలోని ప్రజల చైతన్యానికేమీ తీసిపోదని ఘంటాపథంగా

# మంత్రాలు: నమ్మకాలు

## శ్రీ పాముల సత్యనారాయణ మంత్ర ప్రభావము

విహారు 13-2-57 ఆంధ్ర వారపత్రికలో శ్రీ ఎ. సి. బార్బీ వ్యాసం ప్రచురించినారు. అందులో చివర "శ్రీ పాముల నరసయ్యగారు- శ్రీ పాముల సత్యనారాయణగారు" ఒకరా, ఇరువురా తెలపవలసినదిగా సూచించినారు.

వారిద్దరు వేరు వేరు వ్యక్తులే. పాముల నరసయ్యగారి మంత్రమునకు, సత్యనారాయణగారి మంత్రమునకు ఫలిత మొకటైనా- చాల వ్యత్యాసమున్నది.

శ్రీ నరసయ్యగారు, పాముకరిచిన వ్యక్తిని ఆయన దగ్గరకు తీసికొనివస్తే మంత్రము వేసెదరని వినికిడి. అదే నిజమయితే-శ్రీ సత్యనారాయణగారి మంత్రము చాల గొప్పదని చెప్పక తప్పదు. ఏమనిన–పాముచే కరువబడినవ్యక్తి ఎన్నివందల మైళ్ళ దూరములో నున్నప్పటికి-ఆ వ్యక్తిని అనపర్తి శ్రీ సత్యనారాయణగారి సముఖమునకు తీసుకొని రానవసరములేదు అట్టి వ్యక్తియొక్క పేరు మాత్రము శ్రీ సత్యనారాణగారి చెవిని వేసినమాత్రమున ఆ పాముకాటు తిన్నవాడు లేవవలసినదే. లేదా-అంతేకన్న సులువు మార్గము-అనపర్తి రైలుస్టేషనులో శ్రీ సత్యనారాయణగారిచే మంత్రబద్ధము చేయబడిన ఫోనులో ఆ పేరు చెప్పిన మాత్రాన ఆవ్యక్తి బ్రతికి లేవవలసినదే.

ఒకసారి కోటిపల్లిలో ఒకనికి పాము కరచినది. అతనిపేరు మా కంపెనీ ఫోను ద్వారా ఇక్కడకు తెలిపినారు. వెంటనే నేను స్వయముగా శ్రీ సత్యనారాయణగారింటికి వెళ్లి ఆ వ్యక్తిపేరు చెప్పినాను. ఆయన "సరే వెళ్లు" అని మాత్రమన్నారు. నేను ఆశ్చర్యపోయినాను-మంత్రము వెయ్యరా అనుకున్నాను. అదే మొదటి అనుభవం నాకు. తిరిగివచ్చి కొందరిని వాకబు చేయగా "అంతే" అన్నారు.

తరువాత ఫోనులో వాకబుచేయగా పాముచే కరువపడినవాడు బ్రతికినాడని కబురు చెప్పారు కోటిపల్లినుంచి.

పాము కరచిన వెంటనే ఆ వ్యక్తి కళ్లలో రెండు చుక్కలు తులసి పసరు పిండినచో ఆ విష ప్రభావము ప్రజ్వరిల్లకుండా కొంత వరకు ఆపుతుందని శ్రీ సత్యనారాయణగారు ఒక సందర్భములో చెప్పారు-కాబట్టి అది ఆచరింపవలసినది.

మంత్రములలో నూటికి నూరుపాళ్లు శక్తి ఉన్నదని ప్రతివారు నమ్మటకు శ్రీ సత్యనారాయణగారి పాము మంత్రము మొక మహత్తర నిదర్శనము-అట్లు నమ్మిక లేనివారికిది యొక సవాలు.

శ్రీ పాముల సత్యనారాయణగారికి ఆయురారోగ్యము-లొసగి భగవంతుడు సర్వదా రక్షించుగాక.

పీసపాటి సుబ్బారావు,
[ఐ. ఎల్. టి. డి-అనపర్తి]

* * *

## మంత్రాల మహిమ

మంత్రాలను, వాటి మహిమలను అంత సులభంగా నమ్మని వాళ్లలో నేనొకణ్ణి. శాస్త్రరీత్యా నిరూపించుటకు వీలులేని ఏ విషయాన్నైనా నమ్మటానికి నేను సాధారణంగా సిద్ధపడను కాని గెండు సంవత్సరముల వెనుక నాకు సంబంధించిన విషయములోనే జరిగిన ఒక వింత చూచినప్పటినుంచీ మంత్రాలన్నీ పచ్చి బూటకాలనే నా వాదనలో కొంత చురుకు, ఘాటు తగ్గించుకున్నాను.

అది 1955 లో జరిగిన విషయం. నేను విజయవాడలో వుండేవాడిని. అక్కడే ఒక మంత్రవేత్తకూడా వుండేవాడు. స్నేహితుల ప్రోత్సాహంమీద ఆయన మంత్రశక్తి పరీక్షించే ఉద్దేశ్యంతో ఆయన వద్దకు వెళ్ళినాను. ఆయన నన్ను నా పేరు ఒక కాగితము మీద వ్రాసి తన కిమ్మనగా అట్లే యిచ్చితిని నన్ను తిరిగి మరునాటి ఉదయం రమ్మనీ, అప్పటికి ఆ కాగితము మీదనే నాకు సంబంధించిన కొన్ని ముఖ్య విషయములు వ్రాసి వుంటవనీ, అవి సత్యమో కాదో నేనే పరీక్షించుకోవచ్చుననీ ఆయన చెప్పినాడు. అట్లే నేను మరునాటి ఉదయమే ఆయన వద్దకుపోగా ఆయన కాగితము నా కందించి చదువుకోమనినాడు. అందు యిట్లు వ్రాయబడియున్నది :

"నీకు సంబంధించిన కొన్ని వస్తువులు ఒక వారము రోజుల వెనుక పరహస్తగతము లైనవి. వాటిని తిరిగి పొందవలెననీ, వాటిని దొంగిలించిన అపరాధిని తెలిసికోవలెననీ నీవు ప్రయాస పడుచున్నావు. కాని, అది నీకు సాధ్యపడదు. అట్టి యత్నాలన్నియు విరమించుకో. నీవు కొద్ది రోజులలో నీ పదవిలో ఉన్నత స్థాయికి పోయే అవకాశం గోచరించుచున్నది"

అది చదివిన వెంటనే నేను ఆశ్చర్యచకితుడనైనాను. ఎందువల్లననగా అందలి మొదటి విషయం అక్షరాల నిజం. నా గదిలోనివి ఖరీదైన వులెన్ రగ్గు, దుప్పటి ఎవరో ఒకవారం వెనుకనే అపహరించియున్నాడు. అవి తిరిగి నాకు ఎన్నటికీ దక్కలేదు! ఇక రెండో విషయం (అనగా నా పదవి విషయం) నిజమౌతుందో లేదో చూడాలని చాల ఆత్రుతగ కొంతకాలం గడిపినాను. అది జరిగిన రెండు నెలలలోపుగానే నిజంగానే నేను నా ఉద్యోగంలో ఒక మెట్టు ఉన్నత స్థాయికి పోయితిని!

ఈ పై విషయాలను ఆ మాంత్రికుడు ఎట్లు గ్రహించగలిగి ఆ కాగితముమీద వ్రాయగలిగినాడోనని నేను ఇప్పటికీ ఆశ్చర్యపోచునే యున్నాను. అందుచే మంత్రాలు వాటి మహిమలు యిత్యాది విషయాలలో నిజానిజాలు తెలుసుకోడానికి కొంత పరిశోధన అవసరమని నా నమ్మకము

కర్నూలు, —సి. ఎస్. రాజు.

* * *

ఈ శీర్షిక క్రింద ప్రచురించబడిన వాద ప్రతివాదనలన్నీ చదువక పోయినా శ్రీ జి. వాసుగారి అభిప్రాయం అందుకు ప్రతిసవాలుగా వెంకటరావుగారు వ్రాసింది చూచుట తటస్థపడింది వారి బలాబలాలు సమంగావున్నట్లు కనపడుతున్నది. కనుక నాకు తెలిసినవిషయాలు వివరిస్తూవున్నాను.

మంత్రాలు నాకువచ్చును కాని ప్రయోగించే అవసరం తటస్థపడలేదు. తర్వాత క్రమేణా శ్రద్ధ (నమ్మిక) పోయింది.

# ★ మంత్రాలు, నమ్మకాలు ★

ఇవి నేర్చుకొని 16 సంవత్సరాలు కావస్తున్నది. ఆ మంత్రాలు యివి.

(1) గురుః బ్రహ్మర్ గురుర్ విష్ణుః గురుర్దేవో మహేశ్వరః గురుసాక్షాత్ పరబ్రహ్మః తస్మై శ్రీ గురువేనమః గురుచరణారవిందాభ్యానమః

(2) దిష్టబంధు, మూష్టబంధు పాపికోపలా బంధు ఛండాలుకోనజడ్ బంద్ అలాక్ సగడ్ భగడ్ సూరేభగవాన్ తేదీవో నజక్ బంద్.

(3) పాములవాకట్టు కాటుబందియై సెక్తురుబందియై యిార్లబిం X X సుకోబంధాః మమగురు నీలకంఠ వాడమా నాకు చెప్పిన గురువు పాదమా నే పోకనిలువు.

(4) గిరికట్టుడు, నెరికట్టుడు, ఆచార్యుల పేరుపెట్టి వారి చేత యిసుకపడితే యెటు చూసేనటు 12 ఆమడ పాతిపోయేది తిరిగి చూస్తే నీశిరస్సు 16 వక్కలుగా పగిలేటట్టు కాడుదు.

మొదటిమంత్రంముందుస్మరించి, తర్వాత కావలసినమంత్రాలు వేయవలయును. 2 వది తేలు మంత్రం. 3, 4 పాము మంత్రాలు. బెణుకు, చెర్ది యిత్యాది మంత్రాలు వచ్చుగాని అవిచాలవరకు మరచిపోయినట్లే. వీటిలోకూడా తప్పులువుండవచ్చును. బాగాగుర్తుతెచ్చుకొని వ్రాసినాఅల వాటులో లేనందున దోషాలు వుండు నేమో.

పైనుదహరించిన మంత్రాలు మామూలు మాటలను పొందుపరచి యేర్పరచుకొన్నవే. ఇలా యేర్పరచుకొన్న అర్థయుతశబ్దాన్ని పదేపదే వుచ్చరించుటవలన, వొకఅదృశ్యశక్తి యెలాకలుగుతున్నదో శాస్త్రరీత్యా వివరణ అవసరం. అప్పుడేఅది నమ్మకాల మీద ఆధారపడినదిగా కాకుండా వాస్తవిక విషయంగా నిలువగలదు. కొన్ని శబ్దాలు (మాటలు) వుచ్చరించి సింహాల్ని ఏనుగులను, ఇత్యాది క్రూరజంతువులను అదుపులో పెట్టుకొనుట తెలిసిందేకదా? పోతే వొకవ్యక్తి మీద గౌరవంవల్లకూడా కొన్ని ఫలితాలు కలుగుట వాస్తవం

ఉదాహరణకు జి. ఉమామహేశ్వరరావు



...చేసేవారు నాకుబంధువులు, శాల్యస్నేహితులు. వీరు 1939 ఆ ప్రాంతాలలో అంగలూరిలో హిందీ నభ్యసించుతున్న రోజులు. విద్యార్థిగావున్నా మనిషిదగ్గర గాంభీర్యం వున్నది. వారియింటికి దాపులో వొకరికి తేలుకుట్టినది. అమితబాధ అనుభవించుచున్నారు ఆవ్యక్తి. వారిబాధచూడలేక తనకు మంత్రంవచ్చునని ప్రక్కవారితో చెప్పి వారిని తనదగ్గరకు రప్పించుకొని యేవేవో గొణుకుంటూ వారిని కాలుని విదిలించమని నాలుగు మట్టిబెడ్డలు విసిరినారు. కొద్దిక్షణాలలో ఆవ్యక్తి బాధపోయి నవ్వుకుంటూ వెళ్ళారు. వారికి మంత్రాలురావు. అయినా నయంచేయ కలిగినారు.

ఇకపోతే పామువిషయం. మావూరిలో వొకమహమ్మదీయ వ్యక్తి మంత్రాలు వేస్తూ వుంటాడు. కాని వారిసమర్థత పరీక్షించే వూహలేనికాలంలోనే మాగ్రామం విడిచినాను. పాములనరసయ్యగారి నామధేయం కూడా వొకప్పుడు మాతల్లిగార్కి పురుగుముట్టుకోవటంవలన విన్నాను. వారికి ఫోను చేసినారు. చిన్నతనం గనుక ఆ వివరాలు అట్టే మనసున నాటలేదు. వొకటిమాత్రం వాస్తవం. మాతల్లిగారికి పాముకాటు బాధ వెంటనే తగ్గలేదు. క్రమేణా తగ్గింది. అది నరసయ్యగారి మంత్రంవల్లనో, లేక నే జెప్పిన మాగ్రామ మంత్రిగానివల్లనో, లేక ఆమెలో ప్రతిఘటనాశక్తి యేర్పడుటవల్లనో తెలియదు.

మాకు దగ్గరలో నున్న గ్రామంలోని ఆసామి పొలం పనికి వెళ్లినారు తిరిగివచ్చునప్పుడు వారికి దారిలో త్రాచు పాము యెదురుపడి తొలగిపోకుండా నిలబడి అటకాయించినదట వారు కొంత ధైర్యవంతులే అనుకోవాలి పారిపోలేదు సరిగదా పై పంచ చేతబట్టుకొని 'పద అన్నట్లు చేయి ఆడించినారు. అది ముందు, వారు వెనుక అలా వూరులోకి అంటే జన సమీపానికి వచ్చినారు. వారికి మంత్రాలురావు. మరి యేశక్తి దానిని అదుపులో పెట్టింది?

కనుక మంత్రాల ప్రభావం వెల్లడించేవారు సవాలుచేస్తే సరికాదు, వాటి శక్తిని విపులంగా, అంటే మాటలకు శక్తి యెలా వస్తున్నది, అదృశ్యంగా అది అవతలవారి మీద యెలా పనిచేస్తున్నది యిత్యాది విషయాలు విపులీకరిస్తే మంచిది పరీక్షకు యివి ముఖ్యం.

పై విపులీకరణకు మంత్రవేత్తలు వుపక్రమిస్తారని ఆశిస్తాను

వై. చంద్రశేఖరరావు,
కాకినాడ.

* * *

## మరాటీమంత్రం

జనవరి 2 వ తేదీని ఫిబ్రవరి ఆరవతేదీని శ్రీ జి వాసు, చవటపల్లి లక్ష్మీ నరసింహంగార్లు "మంత్రాలు: నమ్మకాలు" అను శీర్షిక క్రింద వ్రాసిన వ్యాసాలు నాకు ఆశ్చర్యాన్ని గల్గించాయి. మంత్రాలు అనగా వట్టి హంబక్ అని వీరి విశ్వాసం. దానిని రుజూపరచుటకు శ్రీ నరసింహంగారు 'పల్లెవాడు—పాము' కథను పేర్కొన్నారు. మంత్రవేత్త పాటుపడ్డా, పాముకాటుపడ్డ వ్యక్తి కోలుకోలేదని వారు తెలిపారు. కాని త్రాచుచే కలువబడి కొన్ని గంటలసేపు ఎట్లు బ్రతికెను?—చేపగా తలచినది పాము అని తెలిసినప్పుడుమాత్రమే మరణించుటకు హేతువేమి?—వీటికి సమాధానం వ్రాసి ఉంటే బావుండేది.

నేను మంత్రాలుకలవని నమ్ముతున్నాను. నమ్మటమే కాదు మంత్రాలున్నై. మనస్సు మంత్రపరనము ఏకమైననేకాని మంత్రం పట్టీయదు. అందువలననే ఒక్కొక్క మంత్రాన్ని కొన్నిసార్లు పఠింపవలసినదిగా నియమము కలదు. అట్లు పఠించుటలో ఏ ఒక్కసారియైనను మంత్రము మనస్ఫూర్తిగా ఉచ్చరింపబడుటకు అవకాశముంది. మంత్రవేత్త వ్యాకులచిత్తంతో ఉన్నప్పుడూ, సరియైన ఆరోగ్యస్థితిలో లేనప్పుడూ, ఉచ్ఛారణకు మూలస్థానములైన దంతము, నాలిక లేనప్పుడు మంత్రాలు పట్టయకపోవుట కద్దు. అట్టిది యేదో ఉదాహరణగా తీసుకుని మంత్రాలులేవను తుదినిర్ణయానికి రాతగదు.

మంత్రాలు కలవని రుజూచేసేందుకు నా స్వానుభవాన్ని వ్రాస్తున్నాను. అవి నా చిన్నతనపు దినాలు. బత్తేలకొఅకు గూటిలో వెతికాను. పొంచి ఉన్న తేలు నా కుడిచేతి వ్రేలిని కసికొద్దీ కుట్టింది, "అమ్మా!" అను గావుకేకతో భరింపరాని బాధతో నేను గిలగిల కొట్టుకుంటున్నాను. మావారందరూ ఆదుర్దాచెందారు. అదేసమయమున ఒకాయన అచ్చటకు వచ్చుట తటస్థించింది. విషయాన్ని గ్రహించిన అతను "అబ్బె నీకు కాదు తేలుకుట్టింది—అతనికి—" అని నా ఎదుట వానిని చూపు సరికి అతడు 'కుయ్యో' 'మొర్రో!' అనుట ప్రారంభించాడు. బాధ తగ్గిన నేను సంతోష ఆశ్చర్యాలతో చూచుట ప్రారంభించితిని. అంత ఆ మంత్రవేత్త ఆవిషాన్ని మరొకరికి ప్రాకింపజేశారు. అట్లు వలుగురికిచేసి తరువాత ఎవరికీ బాధ లేకుండా చేయగలిగేడు. అంతవరకూ ఆవింత దృశ్యాన్ని చూస్తూ శిలాప్రతిమలవలె ఉన్న అచ్చటవారు అతడు దేవాంశసంభూతుడని తలిచారు ఆరోజున మా నాయనగారికి ఆ మంత్రవేత్త తన మంత్రప్రభావాన్ని, దానిని నేర్పిన తన గురువు ప్రతిభనుగూర్చి తెలిపారు. అది మరాటీ మంత్రము. ★

ఎం. మధుసూదనరావు, రాచపట్నం.

# అణ్వానంతర శాంతి

'మారన'

(ఒక ప్రసిద్ధ నగరంలో ప్రసిద్ధమైన ఒక వీధి. సమయం ఉదయం. అక్కడక్కడా చిరిగి మట్టిగొట్టుకున్న పాంట్లు, ఇన్‌షర్టులతో, చెదరిన క్రాపులతో మొగమంతా దుమ్ముతో ముగ్గురు వ్యక్తులు. వయస్సు దాదాపు ముప్ఫై, ముప్ఫైఅయిదు మధ్య వాళ్లను ఏ. బి. సి. అనే పేర్లతో మన గుర్తుకోసం పిలుచుకోవచ్చు. ఏ-లావుగా, బి-సన్నగా పొడుగ్గా, సి-ఓ మోస్తరు వస్తాదులా ఉంటారు.)

ఏ: ఎంత భయంకరయుద్ధం! అబ్బ! ఎంతకూ మరుపురాకుండా ఉన్నది. తలుచుకుంటే ఇంకా గుండెలు కొట్టుకుంటున్నవి. ప్రతి అంగుళం మేరభూమి కూడా యుద్ధరంగమే. నా స్నానాలగది, కచేరీగది పిట్టలతో కిటకిటలాడింది. ఆవేశాన్ని తిరి, ద్వేషాన్ని త్రాగినట్లుగా వాళ్లు ప్రవర్తించారు-అబ్బ..

సి: (చీత్కారంగా) అబ్బబ్బ! నీ పూర్వస్మృతులు వినలేక మా చెవులు చిల్లులుపడిపోతున్నాయి. చస్తున్నాం. ఒకేసంగతి ఎన్నిసార్లని వల్లెవేస్తావ్? మాట్లాట్టానికి నీకు యుద్ధంతప్ప మరేమీ లేదా? (బి వైపు చూచి) చూడు మిత్రమా! మనవాడెంత బాధస్థంలో పడ్డాడో

బి. ఆటంబాంబుల ప్రయోగం జరిగాక, ప్రపంచమంతా నాశనమైపోయి, తానొక్కడే మిగిలిపోయాననుకుంటున్నాడేమో? (ఏ-తోటి) నువ్వొక్కడవే కాదోయ్ మిష్టర్! మేమూ బ్రతికాం. నీకంటే లక్షరెట్లెక్కువగా బాధలనుభవించాం

సి. నిజంగా. (ఏ-తోటి) నీకు ద్వితీయ ప్రపంచ యుద్ధవిషయం ఇంకా మరుపురానట్టుంది ఇప్పుడు మూడవదీ జరిగింది. ఆటంబాంబు ఉపయోగంకూడా పూర్తిగా అయిపోయింది.

బి: భగవంతుడి దయవల్ల ఆ బాంబు ఉపద్రవంనుండి మనం ముగ్గురం మాత్రమే తప్పించుకుని బ్రతుకగలిగాం. ఎంతవిచిత్రం! కోట్లు, అర్బుదాల జనం, మొత్తం నశించి-అనేక పట్టణాలూ, సర్వం ధ్వంసమయి-మనం మాత్రమే బ్రతికాము

సి ఇక ఈ విచిత్రాలూ, ఆశ్చర్యాలూ చాలు. ఏతీరో ఓతీరుగా మనం మిగిలాము. మనం ముందు నిర్వహించవలసినపని ఎంతో ఉంది. మనం బాగా ఆలోచించి, చర్చించి ప్రపంచంలో శాంతి నెలకొల్పవలసిఉన్నది. రాక్షసుని నాల్కల్లాగా ఎగిసే యుద్ధజ్వాలలను పూర్తిగా చల్లార్చి, రాబోవు తరాల్లో శాంతి సుస్థిరం చేయవలసిన బాధ్యత మనపైన ఉన్నది. (బి-తో) ఏమంటావ్?

బి. అవును మనం ఆ బాధ్యత వహించక తప్పదు.

ఏ: నేనూ ఒప్పుకుంటాను. ఈ యుద్ధజ్వాలలవల్ల ఆఁ అన్నట్టు గుర్తువచ్చింది. (జేబులోంచి ఎనిమిది అగ్గిపెట్టెలను తీస్తాడు) చూచారా! వీటికోసం ఎంతకష్టపడ్డానను కున్నారు? ప్రపంచమంతా గాలిస్తే ఈ ఎనిమిదే దొరికాయి

సి అంతేనా? సరీగ్గా వెతికావా?

ఏ. ఆఁ ఇలాంటివి సంగ్రహించటంలో మనకు మనమే సాటి ఎక్కడెక్కడివాటినీ మన చేతిలోకి తీసికోవటంలో ఒకరు చెప్పవలసినపని లేదు. ఎన్ని ఎరవేసి సంపాదించినా ఇంతకంటే ఒక్కటి కూడా ఎక్కువ దొరకలేదు. పెధవ్వి, సిగరెట్టు కొల్లలు-మీదగ్గరా ఉన్నాయిగా (ఒక్కటే పుల్ల వెలిగించి తన సిగరెట్టూ వాళ్లవీ అంటిస్తాడు) అగ్గిపెట్టెలు మరీ అన్యాయమయిపోయినవి. ఫ్యాక్టరీలన్నీ బూడిదబుంగలైపోయినయి. (సిగరెట్లు ముగ్గురూ పీలుస్తుంటారు.)

బి (తాపీగా) స్టాలిన్‌గ్రాడ్ యింకా తగలడుతూనే ఉందిగా!

సి: మరి లండనో?

ఏ. అయితే? మీ ఉద్దేశ్యం బోధపడలేదు.

బి: ఉద్దేశ్యమా? అక్కడికే వెళ్లి సిగరెట్లు అంటించుకోవచ్చుగా అని

ఏ: (పెద్దగానవ్వి) ఓరి పెచ్చివాళ్లలారా? అవి ఎప్పుడూ అల్లాగే తగలడుతాయనుకొంటున్నారా? న్యూయార్కులాంటివి ఆర్నెల్లు తగలడి చల్లారలేదూ? వెనకాముందు ఇవీ అంతే

బి: అయితే మనకోహ లాభసాటికాదు. (తలగోక్కుంటాడు)

సి: ఆమాటకు, మనం మొదట ఈ పెట్టెల సమస్య చర్చిద్దాము.

ఏ. అదేంమాట. చర్చించటానికి మరీ పెద్దది, ముఖ్యమైంది ఉన్నది. దాని ముందిదెంత? ప్రపంచాన్ని మనం ఎల్లాభాగించుకోవాలో ముందు ఆలోచించవలసి వున్నది.

సి: అవును - నేను నీతో ఏకీభవిస్తాను.

ఏ (బి తో సగౌరవంగా) ఈ మన సమావేశానికి ప్రథమ సభాపతిగావుండి కార్యక్రమం నిర్వహిస్తారని ఆశిస్తాను. (బి-సితోటి) మీ రేమంటారు మిత్రం!

# ★ అణ్వానంతర శాంతి ★

సి : (తన కంటనట్టుగా) ఊఁ. కానీండి.

బి: మీ రేకగ్రీవంగా బలవంతంచేస్తే కాదనటం భావ్యంకాదుమరి. సోదరులారా మీ సంపూర్ణ సహకారంతో ఈ భారాన్ని వహించటానికి పూనుకుంటాను. మీవిశ్వాసం చూరగొనటానికే ప్రయత్నిస్తాను.. మరి కార్యక్రమం ప్రారంభిద్దామా?

ఏ / సి } : ఊఁ. ప్రారంభించండి.

సభాపతి (బి): (ఏతోటి) మిత్రమా! మీ ఉపన్యాసంతోటే దీన్ని ప్రారంభిస్తే బావుంటుంది.

ఏ: (సిగరెట్టు బాగాపీల్చి విసరిపారేస్తూ లేచి, కంఠం సవరించుకొని) గౌరవనీయ సభాపతీ! ప్రియమైన సోదర సోదరీమణులారా!—క్షమించండి. ఇదిసంప్రదాయం—మనం, ఈనాడు ఈవీథి చివర్న ప్రపంచ శాంతి భద్రతలగూర్చి ఆలోచించటానికి సమావేశమయినాము. సావధానంగా ఆలోచించండి. సోదరులారా! అటంబాంబు ప్రయోగంవల్ల—ఆప్రయోగం ఎవరుచేస్తే ఏంలెండి—ప్రపంచం సర్వనాశనమైంది. గత వివిధ సంస్కృతులూ నశించాయి. . కాని ప్రత్యేక సంస్కృతి చిహ్నాలుగా మనం ముగ్గురం మాత్రమే మిగిలాం ..

సభాపతి / సి } మిత్రత్రయమండలి వర్ధిల్లాలి.

ఏ: (ఉపన్యాసం సాగిస్తూ) సోదరులారా! ఈ మన నినాదాన్ని రుజువుచేసుకోవలసిన బాధ్యత మనపైనే ఉన్నది. సర్వ ప్రపంచభారం ఈనాడు మనభుజస్కంధాల పైనే నిలిచివున్నది. మనకుతప్ప ఈభారం వహించగల సత్తువ మరెక్కడా లేదు. యుద్ధకాముల్ని అణగార్చి శాంతి స్థాపన చేయకుంటే ప్రపంచం మరీ పంచబంగాళమై పోతుంది. చరిత్రకారులు మనల్నిగూర్చి విపరీత వ్యాఖ్యానాలు చేయటానికి ఆస్కారమున్నది. కాబట్టి నాప్రియమైన సోదరులారా! ఏవిధంగానైనా శాంతినిస్థాపించాలి. శాంతి వర్ధిల్లాలి. (చేత్తో నుదురు తుడుచుకుంటూ అలసినట్లు కూర్చుంటాడు. మిగతావాళ్ళుచప్పట్లు చరిచిహర్షధ్వనిచేస్తారు.)

సభాపతి : ఒక చిన్న సూచన మిత్రత్రయ మండలిముందు ఉంచుతాను. మనం ప్రపంచాన్ని—మన అనుకూలాలనుబట్టి-భాగించుకొంటే సొంత బాధ్యతల పైన శాంతి నెలకొల్ప వీలవుతుందని భావిస్తాను.

సి / ఏ } ఏకగ్రీవంగా మేము యీ సూచనను ఆమోదిస్తున్నాము.

సభాపతి అయితే ..మీ రే యేభాగాలు వాంఛిస్తారో తెల్పండి!

ఏ. ఆస్ట్రేలియా, దక్షిణ, ఉత్తర అమెరికాలు నాకు కావాలి. ఈ మూడుప్రాంతాలలో నా సొంతబాధ్యతపై శాంతి నెలకొల్పుతాను

సి : యూరోపు, ఆసియా మాత్రమే నేను తీసుకొంటాను. అక్కడ శాంతినిగూర్చిన బాధ్యత నేను స్వీకరిస్తాను.

సభాపతి. (గాద్గదికంగా) అయితే నాకు ఒక్క ఆఫ్రికా మాత్రమేనా? (గుడ్లు మిటకరిస్తాడు.)

ఏ: సభాపతీ! ఆఫ్రికా అంటే ఏమనుకుంటున్నారు? బహు సమృద్ధమైన ఖండం. ఇందులో మీకేమీ లోటులేదు. రాదు కూడా.

సి: పోనీండి సభాపతీ! అయిస్‌లాండు కూడా తీసుకోండి.

సభాపతి: (ఉద్వేగంతో) ఇది పూర్తిగా అన్యాయం. మిత్రత్రయ మండలికే అవమానకరం. ఈ విభాగం నే నెన్నటికీ ఒప్పుకోను.

సి: (సాంత్వనగా) సభాపతీ! మీరు ఉద్వేగ పడకండి. మీరు ఈ మండలి సభాపతులనే విషయం పూర్తిగా మరుస్తున్నట్టున్నారు. కాని మరువవద్దు. మా అందరికీ ఆదర్శంగా ఉండవలసినవారు మీరు.

ఏ: అవును. మీరు కఠినంగా మాట్లాడి మన మండలి చీలికకు కారణం కావటం నాకెంత మాత్రమూ ఇష్టంలేదు.

సి: నేనాసియా తీసికొన్నానంటే, అది దురాశవల్లకాదు. మిగతావాళ్ళవలె నేను తోచినట్లుగా, హద్దూ పద్దూ లేకుండా కోరలేదు. యూరోపు రక్షణ కోసమే ఆసియా తీసికొంటున్నాను.

సభాపతి: (ఏతోటి) మీరు ఆస్ట్రేలియా నాకెందుకివ్వకూడదు? మొత్తం అమెరికా రెండుభాగాలూ మీకున్నాయికదా! ముగ్గురికీ సమానంగా భాగం కుదురుతుంది.

ఏ: హు. నేనంత పిచ్చివాణ్ని కాదు. చూడండి! ఈ ప్రపంచమంతా మనకు మాత్రమే దక్కటంలో నా ప్రయత్నమే ఎక్కువగా సహకరించిందనేది మరువకండి. ఆ లెక్కకు నేను సగభాగం తీసుకోవలసింది. కాని...పాపమని...

సి: (జేబులోంచి రివాల్వరుతీసి) ఈ వికారచర్చ ఇంకా సాగటం నాకిష్టంలేదు. ఇక చేయి చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడుతున్నది. అపుతారా? లేదా?

ఏ (హేళనగా) ఆఁ. ప్రపంచం మొత్తంలో ఉన్న ఒక్క రివాల్వరు నీ దగ్గర ఉందని ఎగిరిపడుతున్నావా? ఆ పప్పులేం ఇక్కడ ఉడకవు.

సభాపతి: మండలి సభాపతిని నన్నే బెదిరిస్తున్నావా? నా తలలో మెదడు ఉన్నది. దాని ప్రభావం నీకు తెలీదేమో?

ఏ: సభాపతీ! మీరూ ఘర్షణలోకి దిగకండి. అందరూ శాంతించాలి. తాత్కాలిక క్రోధాలకు లోబడకండి. ఈ విశాల ప్రపంచం మనకు సరిపోలేదని పోట్లాడుకోవటం కేవలం అమానుషంగా ఉంటుంది.

సి: అయితే మీరు ఆస్ట్రేలియా సభాపతికిచ్చి మీ శాంతిప్రియత్వాన్ని ఎందుకు ప్రకటించుకోరు?

ఏ. (తల అడ్డంగా ఊపుతూ) చస్తే

(58-వ పేజీ చూడండి)

# వనితాలోకం



## అంత్య నిష్ఠురం కన్నా:
# ఆది నిష్ఠురమే మెరుగు

ఆమధ్య ఒక రోజు సాయంత్రం ఏదో పుస్తకం చదువుతూ కూర్చున్నాను. మాకు తెలిసిన వాళ్ళమ్మాయి వచ్చి "మా అమ్మ దీన్లో పంచదార అడిగి తెమ్మంది" అంటూ ఓ గ్లాసు చూపించింది. "మేము ఇక మీదట అప్పులివ్వం" అని చెపుదామని నోటి దాకా వచ్చింది. కాని ఎంచేతో చెప్పలేక పోయాను. అమ్మాయికి పంచదార ఇచ్చి పంపించాను. అప్పుకొచ్చిన వాళ్ళకి "ఇవ్వం" అని కచ్చితంగా చెబుదామని ఎన్నాళ్ళబట్టో అనుకుంటాను. తీరా ఎవరైనా వస్తే చెప్పలేకపోతాను. వాళ్ళేమనుకుంటారో అనిపిస్తుంది.

అసలు అప్పు చెయ్యడం ఓ దురలవాటనిపిస్తుంది. ఒకసారి అప్పుచేస్తే ఇక ఎప్పుడూ ఏదో ఒకవిధంగా అప్పు చెయ్యాల్సి వస్తుంది. ఈ అప్పులు పోపువస్తువులనుండి, చీరెలు, నగలు వరకు ఉంటాయి. ఎటొచ్చి పెద్దవాటిని-(అంటే చీరెలు గట్రా) అప్పు అనరు. ఇదిగాక మరో తేడాగూడ ఉంది ఏమిటంటే, పంచదారలాంటివైతే వాడుకుని మళ్లీ కొని అప్పు తీరుస్తారు. చీరలైతే కొన్నాళ్లు వాడుకొని తిరిగి వాళ్ళవి వాళ్ళకిచ్చేస్తారు.

అప్పుచేసిన తర్వాత త్వరగా అప్పుతీర్చేద్దామన్న దృష్టి కొందరికి ఉండదు. సాధ్యమైనంతవరకు అప్పు చెయ్యగూడదు. తప్పనిసరై చేసినా ఎంత త్వరలో తీర్చేస్తే అంత మంచిది.

పంచదార అయితే ఫరవాలేదు గాని, కాఫీపొడి, నెయ్యిలాంటి వస్తువులు అప్పు చేస్తే కాస్త చిక్కే. ఎలాగంటే ఒకరి దగ్గర పుచ్చుకున్నమాదిరి వస్తువు మళ్ళీ దొరకక పోవచ్చును. తీసుకున్న దానికంటే ఇచ్చేది మేలురకం అయితే ఇబ్బందిలేదు గాని, కాస్త నాసిరకంఅయితే ఇచ్చినవాళ్లు బాధపడతారు. "అవసరానికిచ్చిందిగాక ఎలాటిది తెచ్చిందో" అనిపిస్తుందిగదా! అందుకనే ముందుగా చూసి అయిపోతున్న వస్తువును తెప్పించుకుంటే సరి. లేకపోతే ఒక్కరోజుకి ఎలాగో గడిపేస్తే సరిపోతుంది. అందువల్ల నష్టమేమి వుండదు.

## మంచి-చెడ్డా



ఇక చీరెలు ఒకరివి తెచ్చి కట్టుకోవడం చాల తప్పు. ఇది ఆరోగ్యానికిగూడ అంత మంచిదిగాదు. మన చీర మనం కట్టుకున్నపుడు ఉన్న తృప్తి ఇతరుల చీర కట్టుకున్నపుడు వుండదు. ఒకోసారి ఎంత జాగ్రత్తగా వున్నా బట్టలు పాడవుతూ వుంటాయి. మనవైతే ఫరవాలేదుగాని, అదే ఎరువుచీర అయితే ఎంత బాధ! ఉన్నంతలో కట్టుకుంటే ఏ గొడవా లేదు.

నగలు ఎరువు తేవడం మరీ తప్పు. అలా తీసికెళ్లిన నగలు ఎక్కడన్నా పోతే ఎంత కష్టమో చెప్పక్కరలేదు. ఎంత పరిచయమున్నా నగలు అప్పు యివ్వగూడదు. పుచ్చుకోకూడదు. కొన్నాళ్ళకిందట మాకు తెలిసినావిడఎవరికోచంద్రహారంఇచ్చిందిట పెళ్లికెళ్ళి వచ్చి ఇచ్చేస్తాం అని ఆవిడ పట్టుకెళ్ళి దర్జాగా తాకట్టుపెట్టేసింది. ఈ సంగతి తెలిసి వాళ్ళు, వీళ్ళు పోట్లాడుకున్నారు. ఎన్నాళ్లబట్టో ఉన్న స్నేహం నాటితో తీరిపోయింది. చివరికి ఆవిడ నగ ఇచ్చేసిందనుకోండి. అది వేరేసంగతి. అంచేత నగలు ఎరువు అడుగరాదు; ఇవ్వరాదు. అంత్య నిష్ఠురం కన్నా ఆదినిష్ఠురం మేలు.

డబ్బు విషయంలో గూడ ఇంతే. మా బాబాయికి అప్పు ఇవ్వడం అన్నా పుచ్చుకోవడంఅన్నా చెడ్డ సరదా. నీకు చాల నప్పుడు నువ్వెవరికి అప్పు ఇవ్వడం ఎందుకు? అని ఎవరైనా అంటే "అప్పుచేస్తే తప్పు లేదు. ప్రభుత్వము ప్రజల దగ్గర అప్పుచేస్తుందిగదా. మనలో మనం ఇచ్చుకున్నా, పుచ్చుకున్నా బాధలేదు." అంటారు. కాని నాకది నచ్చలేదు. గవర్నమెంటు చేసేదానికి, మనం చేసే దానికి తేడాలేదూ?

జాగ్రత్తపడి పొదుపుగా వాడుకుంటే అప్పు చేయాల్సిన అవసరం వుండదు. ఏమంటారు? మంచమున్నంతవరకే కాళ్ళు చాచుకోవడం మంచిది.

కోకా శ్యామల, మద్రాసు.

ఒరిస్సా వంటకాలు:

# మోతీబోర్ లాడూలు

ఒరిస్సా ప్రాంతంలో మోతీబోర్ లడ్లు చేసుకుంటారు అందులోను జగన్నాథునకు ప్రసాదంలా చేస్తారు

కావలసిన వస్తువులు కప్పు గోధుమపిండి, $1\frac{1}{2}$ కప్పుల పంచదార, 1 కప్పు నెయ్యి, పచ్చకర్పూరం, తులం జీడిపప్పు, తులం కిస్మిసు, ద్రాక్షపండ్లు, కుంకుమపువ్వు

కప్పు మెత్తని గోధుమ పిండిలో కప్పు నెయ్యిపోసి ఎర్రదవులువచ్చేవరకు వేయించాలి కమ్మనివాసన వేస్తూంటుంది పిండి కమ్మనివాసన రాగానే $1\frac{1}{2}$ కప్పు పంచదార దానిలోపోసి గరిటతో తిప్పుతుండాలి సన్ననిసెగతో తిప్పాలి లేకపోతే పంచదార, పిండి మాడిపోతాయి పొయ్యిమీద కన్నా కుంపటిమీదయితే సుఖం పొయ్యి అయితే ఒకప్పుడు సెగ ఎక్కువవచ్చు దీనికిముందరే జీడిపప్పు కొంచం నేతిలో వేయించుకుని ఉంచుకోవాలి ఆమిశ్రమంలో ఈజీడిపప్పు, ద్రాక్ష, కిస్మిసుపండ్లు కుంకంపువ్వు, పచ్చకర్పూరం వేసి 1 నిమిషం వుంచి దించెయ్యాలి అప్పుడు వుండలు కట్టుకోవాలన్నమాట వేడిపట్టగలవారు నిమ్మకాయంతవుండలు చేసుకోవాలి గట్టిగా ఒక చేతిలో వుంచుకొని రెండవచేతితో గట్టిగా నొక్కితే వుండవుతుంది గట్టిగా నొక్కక పోయిన వుండ విడిపోతుంది వేడి భరించలేనివారు పాలుచల్లి వుండ చేసుకోవచ్చు ఇది నెల్లాళ్ళదాకా పాడయిపోదు మధ్యాహ్నం టిఫినుకయినా బాగుంటుంది.

## సీరా

సీరా దక్షిణాదికేసి ఎక్కువగా వాడతారు పొడి, పొడలాడుతూవుంటుంది

కావలసిన సామానులు 1 కప్పు గోధుమ రవ్వ, 3 కప్పుల నీరు, 2 కప్పుల పంచదార 2 కప్పుల నెయ్యి జీడిపప్పు

గోధుమరవ్వ సన్నరవ్వగా వుండాలి గోధుమరవ్వలో పురుగులు ఏమీ లేకుండా ఏరుకునుంచుకోవాలి ఒక కుంపటి మీద రెండుకప్పుల పంచదార మూడుకప్పులనీరూ కలిపి పెట్టుకోవాలి రెండవకుంపటి మీద ఒకకప్పు ఏరుకున్నరవ్వా, రెండు కప్పుల నెయ్యీ కలిపి ఎర్రధవులుగా వేయించుకోవాలి పంచదారనీళ్ళూ, గోధుమరవ్వా కుంపట్లమీదనుంచి దింపుకోవాలి పంచదార నీళ్ళున్న పాత్రలోకి వేయించిన గోధుమ రవ్వ కొద్దికొద్దిగా పోస్తూ గరిటతో తిప్పుతూండాలి అల్లాఅని వేయించిన గోధుమ రవ్వలో పంచదారనీళ్ళు పోయకూడదు. పోస్తే మంటలేస్తుంది అదిగాక గోధుమ రవ్వ వుండలుకడుతుంది అల్లాగాకుండా గోధుమరవ్వ పోస్తూ కలియబెట్టిన నాలుగు ప్రక్కలా కలుస్తుంది రెండూకలిసినప్పుడు నీళ్ళు, నీళ్ళుగావుంటుంది అలాఅయిందని భయపడనక్కరలేదు సన్నటి సెగమీద వుంచి గరిటతో తిప్పుతూండాలి రెండవ కుంపటమీద జీడిపప్పు ఎర్రగా వేయించుకుని అందులో వేసెయ్యాలి దాంట్లో నే కిస్మిసు, ద్రాక్ష, ఏలకపొడుం వేసుకుని గరిటతో త్రిప్పుతూండాలి ఇది గట్టిపడటానికి చాలా సేపు టైము తీసుకుంటుంది కాని ఓపికగా త్రిప్పుతూంటే సుమారు రెండుగంటలకి పాత్రఅవుతుంది అంటే మన ఇంటిదగ్గర కాసిన గోరుచిక్కుడు కాయ కూరలే వుంటుంది 15 రోజులదాకా పాడయిపోదు. మధ్యాహ్నం [illegible]

[illegible]

కుమారి అద్దంకి శ్రీదేవి.



# పంజాబీల అతిథి మర్యాదలు

పంజాబీలు అతిథుల్ని ఆదరించటము లోనూ, మర్యాద చేయటము లోను మొదటిస్థానం ఆక్రమిస్తారనుకుంటాను. వాళ్ళ ఆదరణలో సగం వంతున్నా మనకు చాలనిపిస్తుంది. ఎవరైనా ఇంటికి వెళ్లడమే తడవు రండి, కూర్చోండి, చా, సికంధి (వర్బత్) ఏవి కావాలని అడుగుతారు. మనం వద్దంటే ఆ కాలానుగుణంగా ఏదో ఒక పానీయం తెచ్చిస్తారు. వాళ్ళమాటల్లో ఆదరణ అపేక్ష బాగా కనబడతాయి. హాయి అనిపిస్తాయి. ముఖపరిచయము లేకపోతే, ఫలానా అని పరిచయంచేసినా చాలు వాళ్ళు ఒక్కలాగే ఆదరిస్తారు. ఉదాహరణకి ఒకటి, రెండు ఈ క్రింద వ్రాస్తాను. మేము ఢిల్లీలో పదేళ్ళు ఉన్నాము లెండి. ఇప్పుడు 102 మైళ్ళ దూరంలో ఉన్నాము ఢిల్లీకి.

ఒకసారి నేను, మానాన్నగారు ఢిల్లీవెళ్ళి పంజాబీల ఇంట్లో బసచేసేము. ఇంటామెని

## ఎన్. సుగుణ
## (హిస్సార్, తూర్పుపంజాబ్)

రెండు మూడుసార్లు చూసుంటాను అంతే. వాళ్ళింట్లో ఉన్నది సరిగా మూడుపూటలే. అయినా తరవాత ఆమెని ఎన్నోసార్లు తల్చుకున్నాము. మేము బెడ్డింగ్ పట్టుకొని వెళ్లినా ఆమె విప్పనివ్వలేదు. పైగా దెబ్బలాడింది. "ఒక్క రోజుకోసమని ఇంతసామాను ఎందుకని? మాది ఇల్లు కాక అడవనుకున్నారా" మంచాలు, పరుపులు, కప్పుకునేందుకు రోజాయిలు (యిటుప్రక్క కప్పుకునే పరుపులు) మొదలుకొని ఇంట్లోవాడుకొనే స్లిప్పర్లు వరకూ సప్లయిచేసింది. భోజనానికి కూడ ఆమె ప్రతీదీ అడిగివండింది. (ఎందుకంటే మద్రాసీలమని) ఏమిటి తింటామో ఏమితినమో అని ఆమెభయం. అందరూ ఇలా చెయ్యగలుగుతారా? అని అడగవచ్చు. ఇలా కాకపోయినా కొంచెమేనా మనం నేర్చుకోవచ్చును. పంజాబీలలో చాలామంది ఇలాగే చేస్తారు. ఎందుకంటే మేము చాలాసార్లు పంజాబీల ఇళ్ళల్లో ఆతిథ్యంపొందేము. ఎవరింటికి వెళ్లినా కట్టుకొనే బట్టలు తప్పించి మిగిలిన ఏసామాను తెచ్చుకున్నది మేము ఉపయోగించుకోలేదు. అన్నీ వాళ్లే సప్లై చేశారు.

వీరిలో గొప్పా బీదా లేదు అందరూ ఒక్కలాగే ఆదరిస్తారు.

# తెల్లవారింది...

కోడికూతలూ, అత్తగారు మజ్జిగచేస్తున్న చప్పుడూ కలసి రవికి మెలకువ తెప్పించాయి. ఓసారి బద్ధకంగా ఒళ్లువిరుచుకొని, మంచం దిగి, నాలుగడుగులేసి కిటికీ తెరిచి చూశాడు. బాగా తెల్లవారలేదు. మనిషిని మనిషి పోల్చుకోటం కొంచెంకష్టం. మంచంమీద పద్మ ఓపక్కగా ఒరిగి నిద్రపోతోంది. కొంకీకున్న చొక్కా తగిలించుకొని, గదిబయటకొచ్చి, తలుపులు దగ్గరగాలాగి వీధిలోకి వచ్చాడు రవి. కాలకృత్యాలు తీర్చుకోటానికి అలా కాలవవేపుగానీ, పొలాల వేపుగానీ, వెళ్ళటం అత్తవారింటికి పల్లెటూరువచ్చాక అలవాటయింది రవికి. దారంతా నిర్మానుష్యంగావుంది.

రవి కొంతసేపటికి తిరుగుముఖం పట్టాడు. అప్పటికి కాస్త తెల్లవారింది. దార్లవెంట, నీళ్లుతెచ్చుకొనే పడుచులూ, ముఖాలుకడుక్కొనే పెద్దలూ, పొలాలకెళ్ళే రైతులూ, గొడ్లనితోలుకెళ్ళే కుర్రవాళ్లు, రకరకాలవ్యక్తులు తారస పడుతున్నారు రవికి. ఇద్దరు పడుచులు రవినిచూసి పకుక్కుమని నవ్వుకొంటూ వెళ్లిపోయారు. రవికి చిరాకేసింది. ఓరైతెదురుపడి రవినిచూచి ముసిముసిగా నవ్వుకొంటూ తప్పుకొన్నాడు. కాస్తదూరం వెళ్ళేసరికి ఇద్దరుపెద్దలు ఎదురుపడ్డారు. ఒకాయన "ఈకాలమే చిలిపికాలం" అన్నాడు. ఇంకోకాయన "ఈ అబ్బాయి జగన్నాధంగారి అల్లుడుకదూ" అన్నాడు. వాళ్లమాటలు అనుకొన్న తర్వాత నవ్వుకోటంకూడా విన్పించింది రవికి. కొంచెం ఆశ్చర్యమేసింది. తలొంచుకొని నడుస్తున్నాడు. ఐనా, ప్రతివ్యక్తీ రవినిచూసి నవ్వుకోవటమే.

"నన్నుచూచి ఎందుకు వీళ్లిలా నవ్వుకొంటారు? నా మొహాన్న బొమ్మలాడుతున్నాయా?" అనుకొన్నాడు రవి. ఏదోవిధంగా ఇంటికిచేరాడు. వీధరుగుమీద బావమరది మొహంకడుక్కొంటున్నవాడు రవినిచూసి చిన్నగా నవ్వాడు. రవికి వళ్లు మండిపోయింది. నాలుగు తన్నుదామన్నంత కోపమొచ్చింది. మొహం చిటపటలాడించుకొంటూ చావిట్లో అడుగెట్టాడు.

చావిడి తుడుస్తూన్న రవి మరదలు బావగార్ని చూచి ఫక్కుమని నవ్వింది. "ఏమండోయ్ బావగారూ, నాటకాల్లో వేషాలేస్తున్నారా?" అంటూ తిరిగి నవ్వింది. రవికి ఏడుపొచ్చినంత పనైంది. నాలుగంగల్లో గది తలుపులు తోసుకెళ్లి గదిలోపడ్డాడు విసురుగా.

ఆ చప్పుడుకు మెలకువ వచ్చినా బద్ధకంగా పడుకొనివున్న పద్మ తలెత్తి చూసింది రవిని. పద్మ మొహంలో రవ్వంత మందహాసం చిందింది. మంచం మీంచి లేచింది. రవికి పద్మమీద పట్టరానంత కోపంవచ్చింది. అందరూ తనని చూచి నవ్వుతున్నందుకు రవి వుడుక్కున్నాడు. తన అక్కసంతా శ్రీమతి మీద చూపుతూ "ఎందుకలా ఇకిలిస్తారు? మంచీ చెడ్డా లేకుండా. పల్లెటూరి పశువులు. అందరికీ ఏమైనా పిచ్చెక్కిందా? నా మొహాన్నేమన్నా తోలుబొమ్మలాడుతున్నయ్యా?" అన్నాడు కోపంగా, చిరాగ్గా.

"ఎవ్వరికీ పిచ్చెక్కలేదు లెండి, మీ వాలకంచూస్తే" పల్లెటూరి పశువులు కూడా, నవ్వుతాయ్. కాస్త మీ ముఖపద్మం అద్దంలో చూచుకోండి అంటూ డ్రాయరుమీద అద్దం తెచ్చియిచ్చింది పద్మ. గబుక్కున అద్దం చేతిలోకి తీసుకొని మొహం చూచుకున్నాడు రవి. మొహాన్న ఏముంది?

కాటుక మరకలు దట్టంగాఅంటుకొని, తెల్లటి మొహానికి మచ్చల్లా వున్నాయి. బుగ్గలమీద, గడ్డంమీద, ముక్కుకొసన, యింకా అక్కడా ఇక్కడా.

రవికికూడా నవ్వొచ్చింది. "ఎలా అంటుకొంది కాటుక నాకు?" అన్నాడు ఆశ్చర్యంగా. "ఏమో" అంది పద్మ నవ్వుతూ. పద్మకళ్లు కాటుకతో నిండి మిలా మిలా మెరిశాయి. "అసలు నువ్వు కాటుకెందుకు పెట్టుకొన్నావ్?" అన్నాడు రవి చిరుకోపం అభినయిస్తూ.

"ఆఁ చాలాబావుంది వరస. ఉరుమురిమి మంగలంమీద పడ్డట్టు" అంది పద్మ నవ్వుతూ.

"అయితే నాదే తప్పంటావా? ఏది ఏమైనా నువ్వు ఇప్పట్నుంచీ కాటుక పెట్టుకోవద్దు. అలా పెట్టుకొంటే నేను నీజట్టుండను." అన్నాడు రవి పద్మ పైటచెంగులో కాటుకమరకలు తుడుచుకొంటూ, ముద్దుగా.

— దద్దనాల అనూరాధ, (బొమ్మిడి).

# 'ఇలాంటివాళ్లతో ఎలా?'

27-2-57 ఆంధ్ర పత్రికలో పొద్దు మీరిన అలవాట్ల గురించి కి. ఉత్తరగారు వ్రాసినది. చదివాక నాకు అలాటిదే ఓ సంఘటన గుర్తుకు వచ్చింది. ఆమె చెప్పినట్లు మొహమాటం లేకుండా వాళ్ళ మనసులోని అసూయంతా ఏదో ఒక విధంగా మాటలద్వారా వెళ్ళగక్కందే ఊరుకోరు కొంతమంది. ఇట్లాంటి వాళ్ళను మార్చటం ఎలాగో తెలియదు.

మా స్నేహితురాలు ఒకామె 5వ మాసం గర్భిణి అని తెలిసి మా అమ్మ ఒకనాడు విందుకు ఆహ్వానించింది. ఆమె ఎంతో సంతోషంతో ఆరోజున మా ఇంటికి వచ్చింది. ఆమెతోపాటు మేమంతా భోజనాలుచేసి తాంబూలాలు వేసుకుంటూ, సరదాగా మాట్లాడుకుంటున్నాము. ఈసందడంతా విని పానకంలో పుడకలాగా మా ప్రక్కవాటాలో వున్న ఒకావిడ, "ఎవరా వచ్చిందీ అంటూ" లోపలికి వచ్చింది. ఈమె వచ్చిందంటే నాకు తగనిభయం. ఏదో ఒక చుప్పనాతిమాటో పెంకిమాటో అనేసి వెళుతుంది. మా స్నేహితురాలిని పరిచయం చేశాము. ఆమె గర్భిణి అని తెలుసుకుని, "అయ్యో అమ్మా. అక్కడ మాకు తెలిసిన ఒకమ్మాయికి ఇలాగే డెలివరీ సమయంలో చాలకష్టమై, ఆపరేషన్ చేశారూ, పుట్టు కేశారు, ఎక్కడ చూసినా ఇలాంటి కేసులే వస్తూ అందులోను మొట్టమొదటి కాన్పు అంటున్నావు. హాస్పిటల్కి వెళ్లి ఎక్సరే తీయించుకో" అంటూ ఎక్కడలేని దయా కారుతున్నట్లు చెప్పి వెంటనే వెళ్ళిపోయింది. అంతవరకు ఉత్సాహంగా వున్న మా స్నేహితురాలు ఈ మాటలు వినేసరికి చాల భయపడిపోయింది. తన కేవిధంగావుంటుందో నని పాపం చాల దిగాలుపడిపోయింది. మా అమ్మ 'అకేమిటమ్మాయి. అలా దిగులు పెట్టుకుంటున్నావు. అవిడ మాటలకేమిలే. అలాగే చెపుతారు. నీకేమి భయంలేదు. సుఖంగా ప్రసవిస్తావు, భయపడకు, అని ఎన్నోవిధాల ధైర్యం కలిగే మాటలు చెప్పి పంపించింది. ఆనందంగా కళ, కళలాడుతూ వచ్చిన ఆమె ముఖం వాడిపోయింది. ఏదో బాధతో వెళ్లి పోయింది. సంతోషంగా వున్న ఆమె మనసును ఈవిడ వచ్చి పాడుచేసిందే అని మాకెంతో కష్టం కల్గింది. ఇలా చెప్పి వారి దను ఏమనాలి! అందులోను గర్భిణిస్త్రీతో మాట్లాడే విధం ఇదేనా. అది వారికి తెలియక కాదు. ఒకరి మనసును ఎంత కష్టపెడితే వారికి అంత సంతోషంగా వుంటుందేమో! ఈ రకంవారు చాలచోట్ల వుంటారు. ఏ విషయమైనా గోరంతలు కొండంతలుగా చేసి చెప్పి అవతలవార్ని హడలగొడ్తుంటారు. ఈమాదిరి మనుష్యులతో దూరంగానైనా వుండాలి, లేకపోతే వాళ్ళమాటలు వినిపించుకోకుండా మన్నికొనట్టే ప్రవర్తించాలి. అదేమందు. ఏమంటారు?

టి. భాగీశ్వరి రాఘవరావు.
మద్రాసు.

## పంజాబీల మర్యాదలు

తున్నాము ఢిల్లీలో. వెనకనుంచి 'నమస్తే సాహెబ్' అని వినిపించి, వెనక్కి తిరిగి చూసేను. అతడిని చూసినట్టు జ్ఞాపకంకాని ఎవరో జ్ఞాపకం రావటములేదు. అతడు మాత్రం "ఎప్పుడొచ్చారు? పిల్లలంతా కులాసా?" అని ప్రశ్నలడుగుతూ మాఇంటికి (రోటీ ఖానేకో ఆయియే) రొట్టె తిండానికి (భోజనం) రమ్మని ఒకటే బలవంతం చేస్తున్నాడు. చెప్పినా వినేస్థితిలో లేడు. "మేము పేదవాళ్ళమైనా, నా శక్త్యను సారం పెడ్తాను. మీకు లోటు చెయ్యనని" గోల. వాడికి బోధపరచి, "స్టేషనుకి వెళుతున్నాము, రైలు తప్పిపోతుందీ" అని చెప్పి నమ్మించేసరికి తలప్రాణం తోకకు వచ్చింది. ఇంతకీ అతడు ఎవరనుకున్నారు! ఢిల్లీలో మాకు వాడుకగా బ్రెడ్ (రొట్టె) ఇచ్చేవాడు.

సరే అతరువాత బ్రెడ్, బిస్కట్లూ తెచ్చి ఇచ్చేడు ఇలాటి వెన్నో జరిగేయి.

వాళ్ళు అతిథులను తమ ఇంట్లోమనిషిలాగ భావిస్తారు. మనవాళ్లు ఆదరించరని చెప్పటంలేదు కాని వీళ్ళ ఆతిథ్యం ఒకసారి పొందినవారు వాళ్లని ఎప్పుడూ తలుస్తారు. అప్పటినుంచి మాఇంటికి ఎవరేనా అతిథులు వస్తే, "వాళ్లు చేసినట్లు చేస్తున్నామా?" అని మనసులో అనుకొనే వారము.

నామటుకు నాకు క్రొత్తవాళ్ళని చూస్తే నోటివెంట మాటరాదు. వీళ్లని చూసి, అందరూ చెప్పగా కొంచెం అలవాటయింది. పూర్తిగా వీళ్ళల్లాగ తయారవాలని కోరిక. ఎప్పటికైనా అలాగవుతానని నమ్మకం.

పంజాబీలలో ఇంకో ఆచారముంది. ఈ ఆచారం ఈ ఊర్లోనే చూసేను. క్రొత్తగా ఎవరేనా ఇంట్లోదిగితే ఆ ఇంటి ఇరుగు పొరుగు అన్ని సదుపాయాలు (అవసరమైనవి పాలు,టీ, భోజనం) చూస్తారు. అందరూ చుట్టుప్రక్కల వారు అన్నీ కనుక్కొని వెళ్తారు. ఇటువంటివి మనలో ఎంతమంది చేస్తారు? చేసినా తక్కువమంది చేస్తారు. అందరూ ఇటువంటివి నేర్చుకుంటే ఎక్కడి కెళ్లినా సౌఖ్యరావచ్చును. ఏమంటారు? ★

## కొలువుతీరిన రాజులా

కొందరు ఎంత చదువుకున్నా, ఎంత గొప్పవాళ్లయినా, కొన్ని స్త్రీ సహజమైన దురలవాట్లని పోగొట్టుకోలేకపోతున్నా రనిపిస్తుంది. మా స్నేహితురాలు ఒకమ్మాయి ఉంది. మా కందరికంటే అదే ఎక్కువ చదివింది. కాని అందరూ తనతోనే మాట్లాడాలి తనమాటే వినాలి తనదగ్గరే ఉండాలి అనే తత్వం దానిది. ఒకసారి,మాకు కొద్దిగా పరిచయంఉన్న ఒకమ్మాయి వచ్చింది. ఆమె వచ్చారని తెలిసి నేను లోపలికి వెళ్లేలోగా మా నేస్తం నా వెనకే వచ్చేసి "ఏమండీ ఇంటికివచ్చినా పల్కరించలేదు. మా మీద కోపంవచ్చిందా" అనేసింది. ఇంకేం చెయ్యను. తెచ్చికోలు నవ్వుతో "అవునండీ" అన్నాను. ఆ మర్నాడు ఇంకో పెద్దమనిషి వచ్చారు. నేను ఆమెతో మాట్లాడి వచ్చేటప్పటికి మా నేస్తం అంటోంది "ఈ సీటికి ఎవరైనా వస్తేచాలు. ఇంక ప్రక్కనున్నవాళ్ళని పూర్తిగా మర్చిపోతుంది" అని నేను అపలే కోపిష్ఠిని కోపంవచ్చింది. "ఎన్నిరోజులయినా, నన్ను అర్థంచేసికోలేకపోయావ్" అన్నాను. తరువాత మామూలుగానే ఉండిపోయాం లెండి. ఇలాంటి చిన్న విషయాలు స్నేహానికి అడ్డుకావుగా.

మొత్తానికి—ఇలా "నాతోనేఉండాలి. నాతోనే మాట్లాడాలి" అనే సంకుచిత

తత్వాన్ని దూరంచేసికొంటే బాగుంటుందని చెప్తున్నాను.

పాడిశెట్టి సీతాదేవి,
భద్రాచలం.

## మరికొన్ని

6-8-57 వారపత్రికలో సీతామహాలక్ష్మి గారు చిత్తుకాగితాలతో గిన్నెలు చెయ్య వచ్చునని వ్రాశారు. కాని ట్రేలు, పళ్ళెములుకూడ తయారుచెయ్యవచ్చును. ఆమె వ్రాసినట్లుగానే ట్రేకుగాని పళ్ళెమునకు గాని తడిబట్ట ముడతలు లేకుండాకట్టి దానిపై కాగితపు పిండిపూసి ఎండినతరువాత, మరలా కాగితపుపిండితో బాగా నున్నపుచేసి, బాగా ఎండిపోయి ఖంగున మోగిన తరువాత, ఇష్ట మైనరంగులు, డిజైన్లు వేసుకొనిన కర్రతో చేసిన ట్రేలాగే ఉంటుంది. ఆమె వ్రాసినట్లు కాగితములు అన్ని రోజులు నానబెట్ట నవుసరములేదు. మూడవరోజుననే బుట్టలు మొదలైనవి తయారు చేసుకొనవచ్చును. మెంతులు ఒక్కరోజునానినచాలు. ఎక్కువ రోజులు నానినయడల జిగురుఉండదు. మినప్పప్పు అనవసరము. డిజైన్లు చిన్నిబ్రష్‌తో వేసుకొనవలెను.

కొత్తపల్లి రాజ్యలక్ష్మి (చినగంజాం)

## ఇటుపై..

కట్నాల సమస్య; పరిష్కార మార్గం: "కొన్నాళ్ళపాటు ఆడపిల్లలు పుట్టకుండా ఉంటే" (ఆంధ్రపత్రిక 18-8-57) అంటూ ఎ.వై దేహిగారు వ్రాసిన వ్యాసంచూస్తుంటే నాకు నిజంగా జాలివేస్తున్నది. వారి అభిప్రాయంప్రకారం చాలకాలందాకా కట్నాలు తగ్గవేమో అనిపిస్తుంది.

తండ్రి ఆస్తిని కొడుకులతోపాటు, కూతుళ్లూ సమానంగా పంచుకోవడానికి వీలు కలిగించిన హిందూ వారసత్వం చట్టం పుణ్యమా అని ఇటుపై ఈ గొడవ అసలు ఉండదేమో.

వ నూ. శెట్టి, (కలకత్తా)

## "ఆవుపాలు ఎట్లావాడితే మంచిది?"

ఒక కుటుంబంలో పిల్లలకు ఆవుపాలవల్ల లివరు వచ్చిందనీ, ఇంకోరి యింట్లో అరగలేదని ఆవుపాలు మంచివి కావనటం తప్పు. ఆవుపాలలో లివరుజబ్బు కలిగించే గుణం ఉన్నట్లు నాకు తెలిసినంతవరకూ ఎవరూ కనుక్కోలేదు. అసలు లివరుజబ్బు రావటం ఆవుపాలు వాడినందువల్లనే అనే నిర్ణయానికి అంత సులభంగా ఎట్లా వచ్చారో నాకు అర్థంకావటంలేదు. ఒకవేళ అలా వచ్చినా ఆవుపాలలో కొంచెం నీళ్ళుకలిపి బాగా కాచి అయినా పట్టిఉండకపోవచ్చు. లేక పిల్లాడు ఏడ్చినప్పుడల్లా వేళాపాళా లేకుండా అన్నా పట్టిఉండచ్చు. లేక ఆవు జబ్బుది అయినా ప్రమాదమే - మొదటి రెండు విషయాల్లోనూ శ్రద్ధ తీసుకోచ్చు గాని మూడో విషయం ఎట్లా? మనింటికి ఆవు తీసుకొచ్చి పిండేటప్పుడుకూడా మనం ఆవు జబ్బుదో కాదో తెలుసుకోటం కొంచెం కష్టమే - అందుకని ఆవుపాలలో ఎటువంటి దోషాలున్నా పోగొట్టటానికి - మా యిళ్ళల్లో అలవాటు ఏమిటంటే-పాలు కాగుతున్నప్పుడు ఒక చెంచాడు జీలకఱ్ఱ ఒక చిన్నబట్టలో మూటకట్టి దానిని పాలలో మునిగేటట్లు వ్రేలాడబెట్టి బాగా కాగనిచ్చి దింపెయ్యాలి. కొంచెం చల్లారనిచ్చి ఈపాలు పడితే మనకు తెలియని దోషం పాలల్లోఉన్నా పోతుందని మా అనుభవంమీద మావాళ్ళ యిళ్ళలో కలిగిన నమ్మకం.

ముఖ్యంగా పోతపాలు వాడుతున్నప్పటి నుండి కాడ్‌లివరునూనె రోజుకు ఒక చెంచాడు అయినా పట్టటం మంచిది. షార్కు లివరునూనె అయినా ఫరవాలేదు. లేక నీళ్ళలో ఉడికించిన ఒకటొమాటో పండు రసం అన్నా పట్టాలి. ఈ రెంటిలో ఏదీ చెయ్యకుండా పోతపాలు వాడుతుంటే ఏదన్నా జబ్బుచేసిందంటే ఆశ్చర్యంలేదు.

కాని ఆవు పాలల్లో కొంచెం వేడిచేసే గుణం ఉందేమోనని నా అనుమానం. మా పెద్ద అబ్బాయికి రెండో ఏడాది అల్లా ఆవుపాలు పట్టాను. అప్పుడప్పుడు దగ్గుతూ ఉండేవాడు. కాని ఆ దగ్గు ఆవుపాలవల్ల వచ్చిందనిమాత్రం నే చెప్పను అనను. అయినా మద్రాసులో మాదిరికాకుండా మన ప్రాంతాల్లో గేదపాలకన్నా ఆవుపాలు ప్రియంకూడా! మందులవల్ల దగ్గు తగ్గిపోయింది. మూడవ ఏటి నుంచీ గేదపాలు వాడటం మొదలెట్టాను. ఎందుకో గేదపాలు వాడితే పిల్లలు తొందరగా పుష్టిగా ఎదుగుతారేమో అనే ఆలోచన కలిగింది. ఈ అభిప్రాయానికి తగ్గట్లుగా-శాస్త్రీయ దృష్టిలో చూస్తే-దేహం బలంగా ఎదగటానికి కావలసిన వాటిలో ప్రొటీన్లు, క్రొవ్వు, కాల్షియం, ఫాస్ఫరం ఆవుపాలలో కన్నా గేదపాలలోనే ఎక్కువగా ఉన్నాయి. ఇంతా చేసి గేదపాలలో లోపించిందల్లా విటమిను బి, సి లు మాత్రమేగా-అందుకు తగ్గట్లుగా ప్రతిరోజూ టొమాటో పండు, అప్పుడప్పుడు (మూడోఏటితర్వాత) అరటి, బొప్పాయిపండ్లు వాడేదాన్ని. వీటి వల్ల విటమిను బి, సి లభిస్తాయి అని శాస్త్రం చెప్పుతోంది. దీనికి భారతప్రభుత్వం వారి "హెల్తుబులెటిన్ (23 వ నెంబరు) ప్రమాణము. ఉసిరికాయలో ఎక్కువగా విటమిను-సి ఉంటుంది కాబట్టి ఉసిరికాయి పచ్చడిలాంటిది అన్నంలో వాడటం చాలా మంచిదనికూడా అనిపించింది. 8 వ ఏటి నుండి మా అబ్బాయికి ఒకపూట అన్నంపెట్టి మిగతాపూట్ల పాలు ఇచ్చేదాన్ని. ఆవుపాలు వాడే రోజుల్లోనూ, గేదపాలువాడే రోజుల్లోనూ ఏ జబ్బూ చేయలేదు. అయితే దీనికి కారణం పైన వ్రాసిన విధంగా ఆవుపాలు పట్టటం, పోతపాలు వాడే రోజుల్లో టొమాటో పండ్లరసం ఇవ్వటం అని నా అభిప్రాయం. అయినా ఏ పాలు వాడుతున్నప్పుడన్నా అరగటంలేదు అని తోచినా, లివరులాంటి జబ్బులువచ్చే సూచనలు కనిపిస్తున్నా మిగతా పిల్లలమీదకూడా పరీక్షచేసి చూద్దామని, సాహసించకుండా వెంటనే డాక్టరు చెప్పినట్లు చెయ్యటమే మంచిది. అది చాలా అవసరం.

భైరవభట్ల లీలా సీతారాం,
మద్రాసు.

★

గృహవైద్యం

# చీటికీ మాటికీ మందుల చీటీ లెందుకూ---

కె. పద్మజ, (తాడేపల్లిగూడెం)

పిల్లాజెల్లా ఉన్న సంసారాల్లో డాక్టరు బిల్లులకు, మందులకు బోలెడుడబ్బు ఖర్చు అవుతూ ఉంటుంది. ఈఖర్చు భరించలేక, మానుకోలేక అవస్థలుపడేవా రెందరో ఉన్నారు. సుస్తీచేస్తే వైద్యుడి దగ్గరకు వెళ్ళవలసిందే కాని, చీటికి మాటికీ, చిన్న చిన్న వాటన్నిటికీ డాక్టరుకోసం పరుగులెత్తడం అనవసరం, డబ్బు వృధా అనిపిస్తుంది. శ్రీ వినోబాభావే చెప్పినట్లు సాధ్యమైనంత వరకూ చిన్న చిన్న సుస్తీలను మనమే నివారించుకోవాలి.

నేను ఇలాటివాటికి కొన్ని సూచనలు చెప్తాను. ఇవి అన్నీ అనుభవంమీద తెలుసుకున్న వే తప్ప ఊహించి రాసినవికావు.

ప్రతి పిల్లలుగల ఇంట్లోను ఆరోగ్య విషయంలో తల్లులు చాలాజాగ్రత్త వహించాలి. ఉదాహరణకి. చిన్న పాపకి జలుబు చేసిందనుకోండి వెంటనే కస్తూరి మాత్రల సీసా ఇంట్లో వుంచుకుని రాత్రి సమయంలో రెండు లేక మూడుమాత్రలు వేయాలి ఆ జలుబు ముదిరి పిల్లలను బాధపెడుతుందనకోండి అంటే ఊపిరి సల్పక పాలుత్రాగలేకపోవుట, ఆయాసం, దగ్గు, జ్వరం మొదలైనవి అప్పుడు చాయపసపు ఆముదంలోకలిపి త్రాగించండి అపుడు వెంటనే నీలగిరితైలం చేతులలో వేసుకుని వీపుకి గుండెకి బాగా రాయండి కొంత శ్లేష్మం కరుగుతుంది చారెడు వాము కుంపటిమీద చిన్న గిన్నెలోపోసి వేయించండి ఒక చిన్నగుడ్డలో వేగిన వామపోసి నాలుగొంగులు మూటలాగు పట్టుకుని పసిపిల్లలవీపుమీద పట్టినంత వేడిగా కాచాలి మళ్ళీ ఆ వాము వెచ్చచేసి మళ్ళాకాచాలి. ఇలా 4 సార్లు చేస్తే చాలా భాగం జలుబు, శ్లేష్మం తరిస్తుంది. కాళ్ళుజాపి బిడ్డని కాళ్ళమీద బోర్లా పరుండబెట్టి మరీ కాచాలి. గుండెకి కాచరాదు. ఇలా ప్రొద్దుట, సాయంకాలం కాచాలి, 2 రోజులు ఎటువంటి జలుబైనా తగ్గితీరుతుంది. చివరికి న్యూమోనియా విషయంలోకూడా ఈపద్ధతి బాగా పనిచేసింది.

పచ్చి దుంపరాష్ట్రం ప్రతిదొడ్డిలోనూపాతి ఉంచుకోవాలి. పిల్లలుగలవారికి చాల ఉపయోగం ఇది. పచ్చి దుంపరాష్ట్రం తేనెలో అరగతీసి (చాలా తేనె వెయ్యాలి కారం కనుక) పట్టిస్తే ఎక్కడి శ్లేష్మ మక్కడ కోసేస్తుంది.

జలుబు బాగా హెచ్చుగా నున్నపుడు ఆముదంలో 4 చుక్కలు ఆకుచెనుడాకుల రసం పిండి త్రాగిస్తే బాగా నెష్ట చేస్తుంది. అలా ఒక పర్యాయం లేక రెండుసార్లు అంతే కాని ఇక పొయ్యకూడదు. ఎక్కువ వేడి చెయ్యగలదు. నేను చెప్పినదంతా మూడు మాసముల బిడ్డలు మొదలుకొని మూడు సంవత్సరాల బిడ్డలవరకువాడవచ్చును. జలుబు తగ్గేవరకు నీళ్లు పొయ్యవద్దు. వేణ్ణీళ్ళలో గుడ్డ ముంచి ఒళ్లు తుడవండి.

మూడేళ్ళుపైబడ్డవారికి జలుబుచేస్తే ఈ క్రిందివిధంగా నయంచేయవచ్చు.

మిరియాల కషాయంలో కొంచెం పాలు బెల్లంవేసి త్రాగించండి. చక్కగా త్రాగుతారు. గొంతునొప్పి మారిస్తుంది. మెడదగ్గర నుంచి నీలగిరితైలం గుండెలకు వ్రాయటం, పంచదారలో 4 చుక్కలు నీలగిరి తైలంవేసి తినిపించండి ఇంకా మూడుపూటల మూడు పెప్స మాత్రలు (Peps) వెయ్యండి. భోజనంలో మజ్జిగ పొయ్యకండా పాలు గాని చారుగాని వాడండి ఇట్టేపోతుంది జలుబు.

ఇక పెద్దల విషయంలో కొందరికి (అందరికీ కాదు సుమండీ) జలుబుబాగా బాధిస్తుంది. చెవులు రెండూ పోట్లు, తలనొప్పి, పళ్లు సలుపు, మెడమట్టూ బిళ్ళలు కడతాయి, గొంతునొప్పి, జ్వరం, ఒళ్లునొప్పులు.

పడిశంపది రోగాలపెట్టు అని ఒక సామెత చెప్తారు పెద్దవాళ్లు. అలాటప్పుడు నీళ్ళ అవిరి పట్టాలి పెద్దవాళ్ళు. నీళ్లావిరి అంటే తెలియనివారుండరు. అదికాక ప్రత్యేకంగా వేన్నీళ్లు చిన్న గిన్నెలో మరగనిచ్చి గుడ్డ ముంచి నీళ్లు పిండివేసి మెడచుట్టు చెవుల దగ్గర మురుగు అంతా కాస్తే చాలాభాగం నొప్పులు తగ్గుతాయి మంచి నూనెలో వెల్లుల్లి పాయవేసి కాచిననూనె, వేడి చూచుకొని చెవిలో వేసుకుంటే పోటు తగ్గుతుంది. పైవిధంగా మిరియాలకషాయం త్రాగితే గొంతు నొప్పి తగ్గుతుంది. తరువాత జలుబు హెచ్చుతగ్గల్నిపట్టి మూడుగాని ఆరుగాని పెప్సమాత్రలు 6 పూటలు వాడాలి ఒక రోజుకి కాఫీ రొట్టె 2 మార్లు తీసుకుని భోజనం మానాలి. అలా చేస్తే రెండవరోజుకి హాయి అనిపిస్తుంది ఎక్కడి బాధలక్కడే పోయి.

అలాగని అసాధారణ పరిస్థితుల్లో డాక్టరు దగ్గరకు వెళ్ళకపోతే ఒకొక్కప్పుడు ప్రమాదిస్తుంది. 

## పార్శ్వపు నొప్పికి చిటకా వైద్యము

పార్శ్వపు నొప్పిగలవారు, కోడి ఈక, చివర నలిపి, నారింజకాయ తోలు సానను పట్టించి, ఏవైపు నొప్పియున్న ఆవైపుగల చెవిలో ఆ ఈకను పెట్టియుంచిన, ఆ నొప్పి అంతా, చెవిలోనికి వచ్చి, మాయమగును. చెవిలోని బాధ కొంచెము సేపులో నయమగును. వారి జీవితములో మరల పార్శ్వపునొప్పి రాదు.

తేలుకాటుకు చిటకా

పటిక ముక్కను కాల్చి తేలు కరచినచోట అంటించినచో, వెంటనే బాధతగ్గ - పటిక దానంతట అదే ఊడి పడును.

శంకరమంచి రామకృష్ణశర్మ,
(రేవేంద్రపాడు)


నేనొక డాక్టర్ని...



కుటీర పరిశ్రమలు:

# తలనూనెల తయారీ

బి. రత్నావళి

స్త్రీలు నిర్వహించదగు గృహ పరిశ్రమలలో తలనూనెల తయారీ ఒకటి. ఇప్పుడు ప్రతివారూ తలకి సెంటు నూనెలు వాడుతున్నారు. ఆ నూనెల్లో వైట్ ఆయిల్ అనే పదార్థం కలిసి ఉంటుంది. అది తల వెంట్రుకలకి హాని కలిగిస్తుంది. వెంట్రుకలు రాలిపోవడం, నెరవడం, ఎదుగక పోవడం జరుగుతోంది. ధనవ్యయం లేకుండానే స్త్రీలు దీన్ని ఇంట్లో తయారు చెయ్యవచ్చు. తలకి రాసుకోవడానికి కొబ్బరినూనె శ్రేష్ఠమైంది. ఈ క్రింది తలనూనె దినుసుల్ని ఒక షావుకారు బజారునుంచి తెప్పించుకుని స్వయంగా తయారు చేసుకుంటే మెదడుకి చల్లగా ఉండి సువాసనగల్గి అన్ని విధములా ఆనందమిస్తుంది.

| దినుసులు | తులములు |
|---|---|
| పట్టివేళ్లు | 7 |
| కచ్చూరాలు | 7 |
| తుంగదుంపలు | 4 |
| బావంచాలు | 2 |
| గవిలాలు | 1/2 |
| ఏలక్కాయలు | 1/2 |
| గంథంవేళ్లు | 1 |
| సాంబ్రాణి | 1 |
| ఆకుపత్రి | 1/2 |
| మరాటి మొగ్గలు | 1/2 |
| గులాబిపువ్వు | 1 |
| తాళిసపత్రి | 1/2 |
| దాల్చినచెక్క | 1/2 |
| పచ్చాకు | 1/2 |
| చెంగల్వగోష్ఠి | 1/2 |
| కస్తూరిపసుపు | 1 |
| కస్తూరిగడ్డ | 1 |
| జటామాంసి | 1/2 |
| నాగకేసరాలు | 1/4 |
| దుంపరాష్ట్రం | 1/4 |
| కళింగరాష్ట్రం | 1/4 |
| బోగడపువ్వు | 1/4 |
| కురువేరు | 1/4 |
| అగరుచెక్క | 1/4 |
| మెంతులు | 1 |
| ఉసిరికపప్పు | 1 |
| తంగెపుగింజలు | 1 |
| తంగేడు | 1 |
| కరక్కాయలు | 2 |
| కాచు | 2 |
| గోరింట (ఆకుగాని పొడిగానీ) | 1 |
| మొత్తం నలభై తులములు | 40 |

వీటిలో ఒక నాలుగు జీడిగింజలు వేసి కచ్చాపచ్చాగా నలగగొట్టి ఒక వీశెడు కొబ్బరి నూనెలో కలిపి ఒక రాగి పాత్రలో పోసి నూనెకు నాలుగురెట్లు నీళ్లు అందులో పొయ్యాలి దాన్ని ఒక రోజంతా బాగా నానబెట్టాలి.

పైని మూతబెట్టి, చుట్టూ గుడ్డకట్టి, అడుగున బాగా దట్టంగా మట్టిపూసి పొయ్యిమీద పెట్టి, ఒక ఔన్సు నిమ్మరసంకలిపి కాచాలి.

గిన్నెమీద మూత పెచ్చుబడే వరకు కాచి మంట తీసెయ్యాలి.

అలా సన్నని సెగతో మూడు రోజులు కాచి మూడవరోజు మూతతీసి, పైనిపచ్చగా సువాసనగా తేలిన నూనెను వంచుకుని నీళ్లను పారబొయ్యాలి. ఈ నూనె సువాసనగా ఉండడమే కాకుండా మెదడుకి చలువ కలిగించి, వెంట్రుకలకు కాంతినిస్తుంది. వెంట్రుకలు రాలిపోవడం, నెరవడం, తగ్గి మెత్తగా పట్టుకుచ్చులా తయారవుతాయి. జుట్టు నల్లబడుతుంది. చాకగా గిడుతుంది.

అడుగున మిగిలిపోయిన చెత్తను ఎండబెట్టి పెసలలో కలిపి సున్నిపిండి తయారు చెయ్యవచ్చును.

## అలంకరణలో శిరోజాల శ్రద్ధ

అలంకరణలో శిరోజాలకు ఎక్కువ శ్రద్ధ తీసుకోవలెను. నిజంగా ఆలోచించినచో మన అలంకరణ అంతా ఒకెత్తు, కురుల నలంకరించుకొనుట ఒకెత్తు. ఇప్పుడు 10 సంవత్సరముల పిల్లలదగ్గరనుండి వెంట్రుకలు నెరయుచున్నవి. నిజముగా ఆలోచించినచో మనము తగినశ్రద్ధ తీసుకోకుండుటే కారణమనుకుంటా.

రేపు తలంటి పోసుకుంటామనగా ఈరోజు రాత్రి పరుండేటపుడు కొంత ఆముదము మాడుకుపెట్టుకొని మరురోజు ఉదయము తలంటుకొనవలెను. ఇట్లు 4 రోజుల కొకపర్యాయము చేసినచో పూర్తిగా వెంట్రుకలు నెరవవు. కండ్లకు కూడ చలువనిచ్చును. మా బామ్మ అతిశయోక్తిగా అంటుండేది పూర్వము ప్రతి రోజు తలంటు, వారానికోరోజు భోజనము చేసేవారని. అట్లాగే కొంత ఓపికతో చేసినచో అంతగా వెంట్రుకలు నెరయవు.

ఈ రోజులలో ఫాషనవనీండి లేక పనితొందరవల్లనో ఎందువలనన్నాగాని బాత్ రూమ్‌లోకి పోతూ కొంత కొబ్బరినూనె మాడున పోసుకొని తల స్నానము చేయుచున్నారు. ఈ కాలములో ప్రతినిత్యం తలకు నూనె పెట్టుకోవటము కూడా మానేశారు! ఇలాగే 8 లేక 4 రోజుల కొకపర్యాయము వ్రాసికొనుట గూడ జరుగుచునేయున్నది. ఇదిచూచి బామ్మలుగాని అమ్మమ్మలుగాని అదేమిటే అంటే ముఖానికి జిడ్డు కారుకుంటూ రోజూ ఎందుకులే అంటుంటారు. అట్లు గాకుండా ప్రతినిత్యము మాడుకు నూనె పెట్టుకోవలెను. ముఖము జిడ్డు కారునను వారు ముఖమునకు దగ్గరగానుండు వెంట్రుకలకు కొద్దిగా నూనె వ్రాసి మాడుకు పెట్టుకొనినచో జిడ్డు కారదు.

మా మామ్మగారి పనిమనిషికి 60 సం॥రాలు వచ్చినా ఒక వెంట్రుకయినా నెరవలేదు. అదేమిటి రాజీ, చిన్నపిల్లలకు కూడా ఇప్పుడు నెరయుచున్నవి, నీకు నెరవలేదు అంటే, "రోజూ నూనెరాస్తే, ఎందుకు నెరుస్తాయి? మీరు నాజూకు అంటూ 4 రోజుల కొకసారైనా నూనె పెట్టుకోరు" అంటుండేది. అట్లా అన్నానని, రోజూ నూనె వ్రాసికొనేవారు, "మేము వ్రాసికొంటాము ఎందుకు నెరసినవని" అనుకోకండి. తలలో ఎప్పుడూ నూనె ఉండటం కండ్లకు తలకుకూడ చాల మంచిది.

—బి. ద్రౌపది, పెదముక్తేవి.

# ★ సంక్రాంతి సఖ్యం ★

(27-వ పేజీ తరువాయి)

లాటరీ బల్లలదగ్గరా, కోడిపందేల దగ్గరా ఒకటి రెండు ఎడ్లబుళ్లు తచ్చాడుతున్నాయి. అయినా రెవరూ భయపడకుండా రెవరిపనులు వాళ్లు చూసుకుంటున్నారు. పేరయ్యగారి ఆడవాళ్లు కొల్లి దూరంగా మామిడిచెట్లక్రింద కూర్చుని చూసి వెళ్లిపోయేరు.

సెలవులేదు వెళ్లిపోతామని చెప్పి అల్లుడూ కూతురూ వెళ్లిపోయేరు. యిల్లు సందడితగ్గి బావురు మంటోంది. అల్లుడు కూతుర్లతో తిరడం అలవాటయిన పేరయ్య కారోజు అన్నం సహించలేదు.

పేరయ్య వీధిలో కొచ్చేసరికి మునసబు వచ్చేడు.

"నాయుడూ! చూసేవా! వీరేశు నేను కొట్టేనని కేసు పెట్టేడు" అని తెలియజేసేడు పేరయ్య.

"అలాగా!" అని తెలియనట్టు ఆశ్చర్యం ప్రకటిస్తూ, 'భూమీపుత్రా యిల్లూ వాకిలీ' అమ్ముకునే యోగం ఉంటే మనమేం చేస్తాం? చెపితేమాత్రం యింటాడా? వస్తానుబాబూ! గరువులో కెల్లాలి." అని సెలవు తీసుకుని వెళ్లిపోయేడు మునసబు.

*　　*　　*

కాలం మైలుబండిలాగ పరుగెత్తుతున్నాది. కాలగర్భంలో 11 నెలలు కలిసిపోయేయి. అంతవరకూ కేసు వాయిదాలతోనే నడుస్తున్నాది. ఇద్దరికీ చెరొక్క ఐదు వందలూ ఊడేయి. వీరేశుకి సహాయం చేస్తామన్న మునసబూ తదితరులూ కోర్టుకొక్క వరకూ ధైర్యంచెప్పి, తర్వాత తప్పుకుని తిరుగుతున్నారు. మునసబు మాత్రం వీరేశు తరఫున వెళ్లినప్పుడల్లా సినీమాలూ, కాఫీ హోటళ్లు అన్నీ వీరేశుకొత్తిన రుద్దుతున్నాడు. అప్పటికి తెలిసింది అసలు భోగట్టా వీరేశుకు అప్పటినుంచీ రాజీపడ డానికి దారులు వెతుకుతున్నాడు.

ఆరోజు వాయిదా. వీరేశు ప్లీడరుగారింటికి వేగం చేరుకుని పిలిచేడు. పైనుండి, 'ఎవరువారు' అన్న గుమస్తా ప్రశ్నకు 'చిత్తం. నేనండి' అన్నాడు వీరేశు.

"నేనే నంటే' పేరూ ఊరూ లేదూ" కోపంగా అన్నాడు గుమస్తా.

"చిత్తం. వీరేశునండి" అంటూ లోపలికి వినయంగా వెళ్లేడు.

"నువ్వు రాజీ పడడానికి తిరుగుతున్నావట" ప్రశ్నించేడు.

"మీ తోడు. నాకు తెలీదుబాబూ" అన్నాడు వీరేశు పల్లెథోరణిలో.

"ముద్ద నాతోనేమిటోయ్! నేను వస్తే నీకేం ఒరుగుతుంది?" గుమస్తా కోపం ప్రదర్శించేడు.

వీరేశు వినయంగా "కామాందులు కటాచ్చించండి' మీ మీదా నాకేం కోపం?" అన్నాడు.

గుమస్తా ఘోరణిమార్చి 'నీ ప్రతికక్షులు నీ మీద అడ్డుపిటిషన్ పెట్టేరోయ్?' అన్నాడు.

"బాబూ అడ్డుపిటీషనా? నే నా మాట వినలేదు?"

'నువ్వు రాజీపడవన్నీ కాదంటూ అడ్డుగా పిటిషను పెట్టేరు'

"పిటిషను నేనెలాగ రాస్తానుబాబూ. నేను ఏలుముద్ర వోడిని?" అనుమానంగా ప్రశ్నించేడు వీరేశు.

"నీకు బోధపడదు. బోధ పర్చాలంటే మా తల పడిపోతుంది"

"కామాందులు కటాచ్చించండి."

"నీ మీద వారంట్లు వచ్చేయి. దానికి 50 రూ॥ కర్చయింది."

"వారంట్లే! సామీ దేందుకుబాబూ"

"నీ కా సెక్షనులు చెప్తేమాత్రం తెలుస్తాయా? పాతబాకీ 150 రూ. యిదో 50. మొత్తం రెండు వందలు. తెచ్చేవా డబ్బు?"

"ఎంత సచ్చినా పెగిలింది కాదు బాబయ్యా!"

"అయితే రాజీ పడిపోతావా? యింత డబ్బు తగలెట్టుకుని ఏంలాభం? కొంపో గోడో తాకట్టు పెట్టి తేవాలిగాని" అన్నాడు గుమాస్తా.

"చిత్తం. తమకు తెల్దా? కొంపా గోడూ యుంటేఅయిపోయేయిభూమిచెక్క తనఖాలో వుంది. గిన్నెముంతా అమ్మి గతనెల కిజా కట్టేను. యీయాల కోడిపెట్ట నొట్టుకుని ఊరంతా తిరిగేను. ఎక్కడా దొరకలేదు. కోనీ పెట్టనిమకోండి"

గుమస్తా నిప్పులు చెరుగుతూ "ఏమిటో పెలా వన ప్లీడరుగారు కోళ్లని తింటారుటోయ్" అన్నాడుగుమాస్తా. "కామాందులుకటాచ్చించండి. కోడి కాకపోతే గొర్రెపిల్లున్నాది."

గుమాస్తా రెచ్చిపోయి ఏమిటా వాగుడు? కామాందు లేమిటోయ్ నీ మొఖం. కామాంధులు, కామాంధులు అంటావు. ఛో! ఛో! గడదింటల్కి కోర్టుకి రా అని తగిలేసేడు.

*　　*　　*

మళ్ళీ భోగి లేపనగా వాయిదాపడింది వీరేశు దిగులుగా యింటికి వెళ్ళేడు. పరిస్థితులు విషమంగా ఉన్నాయి. తిన్నగా వెళ్ళి కుర్చీలో చుట కాలుస్తూ కూర్చున్న పేరయ్యగారి కాళ్లమీద పడ్డాడు.

కొందరి ప్రోత్సాహంవలన తను కేసు పెట్టేననిన్నీ, ఎలాగైనా తనను రక్షించమనిన్నీ, యిల్లు వాకిలీ పోగానే బుద్ధి వచ్చిందనిన్నీ, తన తప్పు తెలుసుకున్నాననిన్నీ రాజీకి వప్పుకోమనిన్నీ వాపోయేడు. ఎవరి ప్రోత్సాహమో వీడి నింతవరకూ తెచ్చిందని ముందే తెలుసుకున్న పేరయ్య వాడి నోదార్చి, మరేం బాధలేదులే ఆనాటికి రాజీ కాగితం పంపిద్దాం అన్నారు.

వీరేశు సంతోషంగా యింటికి వెళ్లేడు. రాజీపత్రం పంపించేరు కోర్టుకి. పేరయ్య అల్లుడూ కూతురూ వచ్చేరు. యిల్లు ఎప్పటి లాగా కళకళలాడింది.

ఊరిలో పెద్దలిదంతావిని "జేనికిదంతా" అన్నారు. 




# నీడ

ఎస్. ఐ. జె. మోహనరావు

బడినుండి బాలుడు
వడి, వడిగ వచ్చి
అమ్మచేరువ జేరి
అనుచుండె నిటులు

"ఎండలో నే వెడితె
వెంటాడు తుంది
వెన్నెల్లో నే వెడితె
వెన్నాడుతుంది

నేనట్లు ఆడితే
తానట్లు ఆడునే
నే వెక్కిరించగా
నను వెక్కిరించునే

తరుముతూ నావెంట
తిరుగాడు తుంది
ఎక్కడికి పోయినా
అక్కడికి వస్తుంది

కుప్పిగంతులు వేసి
తప్పించుకుంటేను
చెప్పకుండా వెనక
చేరుతూ వస్తుంది

ఇంటిలోనిక రాగ
ఇప్పుడే పోయినది
ఇది ఏమిటో నమ్మ
ఇంత వింతగ నుంది"

అని బాలు డనగనే
అమ్మ అక్కున జేర్చి
"జడియబోకుమునాన్న!
జడియకుము చిట్టి!

నీవెంట వస్తుంది
నీజంటగానుండు,
నీ నీడయే గాని
నిన్ను ఏ మనదు!"

అమ్మ ఈవిధముగా
నెమ్మదిగ చెప్పగా
బాలు డంతయును విని
'భయముపోయిన' దనెను.

# చిత్రమైన దొంగ

పూర్వం విక్రమాదిత్యుడు ఉజ్జయిని ఏలే రోజుల్లో ఉజ్జయినిలో 'దుర్ముఖ' అనే పేరుమోసిన గజదొంగ వుండేవాడు. దుర్ముఖికి ఒకసారి రాజమహల్ దోచుకుందామని బుద్ధిపుట్టింది. రాజ మహల్ చుట్టూ పహరావాళ్లు ఎంతో కట్టుదిట్టంగా కాపలా కాస్తున్నారు. ద్వారానికో సిపాయి! వాళ్ల కళ్లు గప్పి లోపలకు ప్రవేశించటం సాధ్యంకాదని గ్రహించాడు దుర్ముఖి. ఒక్క రాజమహల్ వద్దనే కాదు, ఊరంతా కావలి వాళ్ళను పెట్టి ప్రజలకు దొంగలభయం లేకుండాచేశాడు రాజు. అక్కడి పరిస్థితి చూడగానే దుర్ముఖికి జంకు పుట్టింది. తను ఇంకా అక్కడే మకాంవేయటం తటస్థిస్తే తన ఆచూకీ ఎలాగైనా తెలిసిపోయి, తను పట్టుబడిపోక తప్పదని నిశ్చయించుకుని సమీపంలోనే వున్న ఓ అడవిలోకి పారిపోయాడు దుర్ముఖి.

కొంతసేపటికి దుర్ముఖి బాగా అలిసిపోయాడు. ఆకలిదప్పులు అతన్ని ముందుకు అడుగు వెయ్యనియ్యటంలేదు. దుర్ముఖి చుట్టూ కలయజూచాడు. కొంత దూరంలో చిన్న కుటీరం కనిపించింది. దుర్ముఖికి ప్రాణాలు లేచివచ్చాయి. గబగబా ఆ కుటీరంలోకి వెళ్ళాడు.

ఆ కుటీరంలో నివసిస్తున్న సన్యాసి దుర్ముఖి నెంతో ఆప్యాయంగా ఆదరించి పళ్ళూ, మంచినీళ్లు తీసుకొచ్చి దుర్ముఖి ముందు పెట్టాడు.

దుర్ముఖికి ఎంతో భయంవేసింది. తను 'దొంగ' అని తెలిస్తే ఆ సన్యాసి తన నిలా ఆదరిస్తాడా? తన నిజస్థితి తెలుసుకున్న మరుక్షణంలో సన్యాసి తనను శపించక మానడు. అందుచేత దుర్ముఖి సన్యాసి కాళ్ళ మీదపడి "స్వామీ! నేనొక దొంగనైనపక్షంలో మీరు నన్నిలా ఆదరించగలరా?" అనడిగాడు కళ్లనీళ్లతో.

**సుందరపు పద్మ, లలిత**

సన్యాసి చిరునవ్వుతో దుర్ముఖిని లేవనెత్తి "నాయనా! నీవు దొంగవైనా, దొరవైనా నాకు ఒక్కటే. నాఇంటికి వచ్చావు కాబట్టి నీవు నా అతిథివి. అతిథిని సంతృప్తిపరచి పంపటమే నావిధి. అందుచేత నీవు ఎలాటి సంకోచమూ పెట్టుకోక ఇవితిని నీ ఆకలిదప్పులు తీర్చుకో" అన్నాడు. దుర్ముఖి తేలికపడ్డ హృదయంలో ఆకలిదప్పులు తీర్చుకున్నాడు.

ఆ ప్రశాంత వాతావరణం, సన్యాసి హృదయపూర్వకాదరణ దుర్ముఖి మనస్సు నెంతో కలవరపరిచాయి. దుర్ముఖి సన్యాసి పాదాలు పట్టుకుని "స్వామీ! నా వృత్తి దొంగతనం. ఆ దొంగతనం చేస్తేనే గాని పొట్ట గడవదు. ఈ వృత్తిలోనే వుంటూ పాపాలు చేయకుండా ఎలా వుండగలనో నాకేమీ తోచటంలేదు. మీరు కటాక్షించి నాకేదో దారి చూపించాలి" అంటూ ప్రార్థించాడు.

సన్యాసి "నాయనా! నీవు నీవృత్తి చేసుకుంటూనే మోక్షమార్గం సాధించవచ్చు. కాని రెండు విషయాలను మాత్రం నువ్వు జ్ఞాపకం పెట్టుకోవాలి. మొదటిది ఏపరిస్థితి లోనైనా అసత్యం చెప్పకు. ఎప్పుడూ నిజాన్నే

# ★ చిత్రమైన దొంగ ★

పలుకు. పోతే రెండవదేమిటంటే నువ్వు ఎవరి వుప్పూ, కారము తింటావో వాళ్ళ ఇంట్లోమాత్రం దొంగతనం చెయ్యకు. ఈ రెండు సంగతులు గుర్తుపెట్టుకుని ప్రవర్తించావా నిన్నే పాపపంకమూ అంటుకోదు. వెళ్లిరా నాయనా" అంటూ దుర్ముఖి నాశీర్వదించాడు.

దుర్ముఖికి మళ్ళా ఒకసారి రాజమహాల్ దోచుకోవటానికి ప్రయత్నించి చూస్తే బాగుండునని తోచింది. వెంటనే తిరుగుముఖం పట్టి ఉజ్జయిని చేరుకున్నాడు.

అర్ధరాత్రివేళ మహాల్ చేరుకున్నాడు. రాజభవనం దీపాలతో ప్రకాశిస్తూ పట్టపగల్లా వుంది! దుర్ముఖికి లోపల ఎలా ప్రవేశించటమో తెలియలేదు.

ఇంతలో సింహద్వారం కాపలా కాస్తున్న జవాను మనిషి అలికిడి విని "ఏయ్! ఎవరు?" అంటూ కేక పెట్టాడు. దుర్ముఖికి సన్యాసి చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి. "నేను దొంగను" అంటూ ఎదటికి వచ్చి నిలబడ్డాడు.

దుర్ముఖి ధరించిన వెలలేని దుస్తులను చూసి బెదురుతూ కావలివాడు "ఇతనెవరో మహల్‌కు సంబంధించిన అధికారి కాబోలు. కాకపోతే దొంగలెవరైనా 'నేను దొంగ' నంటూ ముందుకు వస్తారా?" అనుకుని "ఎందుకు బాబూ, నాతో హాస్యమాడతారు? వెళ్ళండి బాబూ" అంటూ దారి వదిలాడు. ఇలానే దుర్ముఖి అసత్యమాడకుండా అన్ని ద్వారాలు దాటుకుని కోశాగారంలో అడుగుపెట్టాడు. కంటికి కనుపించిన విలువైన వస్తువునల్లా మూటకట్టుకున్నాడు. ఇంక వాటిని తను సురక్షితంగా బైటకు చేరవేయటమే మిగిలినపని!

ఇంతలో దుర్ముఖికి చెప్పలేనంత ఆకలివేసింది. ముందు కడుపుమంట చల్లార్చితేగాని బైటపడటం అసాధ్యమని తోచింది దుర్ముఖికి. వంటశాలను వెదుక్కుంటూ వెళ్లి ఒక కంచంలో కావల్సినవన్నీ పెట్టుకుని తృప్తిగాభోంచేసి ఇవతలికొచ్చాడు.

దుర్ముఖి మూట భుజాన్ని వేసుకున్నాడు. ఇంతలో సన్యాసి చెప్పిన రెండవ విషయం జ్ఞాపకానికొచ్చింది. అందుచేత దుర్ముఖి మూట విప్పేసి వాటినక్కడే పడేసి వట్టిచేతులతో బైటకొచ్చేశాడు.

మరుచటిరోజు రాజు కోశాగారం ప్రవేశించేసరికి అంతాచిందరవందరగా పడివుంది. పోనీ ఏ దొంగైనా కొల్లగొట్టుకున్నాడేమో అనుకుంటే అదీ కనపడదు. ఒక్క వస్తువైనా పోలేదుకాని పెట్టినచోట లేకుండా క్రింద అడ్డదిడ్డంగా పడివుంది. విక్రమాదిత్యునికేమీ పాలుపోలేదు. ఎవడో చిత్రమైన దొంగ ఖజానా ప్రవేశించటంమాత్రం ఖాయం! ఇలా ఆలోచించి రాజు "రాత్రి కోశాగారంలోకి దొంగ ప్రవేశించాడు. ఎలాగైనా మీరు అతన్ని సాయంకాలంలోగా నా దగ్గఱకు తీసుకురావాలి" అని కావలివాళ్ళకు హుకుంజారీ చేశాడు.

కావలివాళ్ళు హడిలిపోయారు. ఆలోచించగా, ఆలోచించగా వాళ్ళకు రాత్రి వెలలేని దుస్తులు ధరించి 'దొంగ'నని చెప్పకుంటూ పోయినవాడే నిజమైన దొంగని తట్టింది. పట్టణమంతా వెదికి వెదికి చివరకు దుర్ముఖిని తీసుకొచ్చి రాజు ముందు నిలబెట్టారు. రాజు దుర్ముఖి సమాచారమంతా అతన్నడిగి తెలుసుకున్నాడు. దుర్ముఖి సత్యసంధతకు విక్రమాదిత్యుడెంతో సంతోషించి దుర్ముఖి నెంతో గౌరవించి, సత్కరించి పంపాడు.

దుర్ముఖి "ఆహా! ఒక్కరోజు ఆ సన్యాసి సాంగత్యం లభించినందుకే నాకు రాజసత్కారం లభించింది! నిత్యమూ అతని సాన్నిధ్యంలోనే జీవితం గడిపితే నా పాపాలన్నీ పటాపంచలైపోతాయనుకోవటంలో అబ్బురమేముంది?" అనుకుని సర్వమూ పరిత్యజించి సన్యాసివద్దకు వెళ్ళిపోయాడు నాటినుండి దుర్ముఖి 'సుముఖి'గా మారిపోయాడు. తన జీవితశేషాన్ని అతని సాన్నిధ్యంలోనే గడిపి తనజన్మ సార్థకం చేసుకున్నాడాచిత్రమైన దొంగ. ★

# రాష్ట్రపతి ఎన్నికపై ఊహాగానాలు

(కే-వి కేశ తరుణాంణం)

పెద్ద మెజారిటీలు వచ్చాయి. షెడ్యూల్డుకుల అభ్యర్థి శ్రీ నవల్ ప్రభాకర్‌కు 80 వేల ఓట్ల మెజారిటీ లభించింది. అదే నియోజకవర్గంలో జనరల్ స్థానానికి కాంగ్రెసు అభ్యర్థి శ్రీ కృష్ణనాయర్ 70 వేల ఓట్ల మెజారిటీతో గెలిచారు. ఆయన ప్రత్యర్థి మరెవరో కాదు— ఢిల్లీ ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షురాలైన శ్రీమతి సుభద్రా జోషీ భర్తగారే.

## ఢిల్లీలో కాంగ్రెస్ గెలుపు

ఢిల్లీలో కాంగ్రెసు అభ్యర్థులంతా గెలవడమన్నది ఢిల్లీకి ప్రత్యేక రాష్ట్ర ప్రతిపత్తిని రద్దుచేసిన ప్రభుత్వ నిర్ణయానికి విజయమని చెప్పవచ్చును. అలా రద్దుచేయడం తగదనే వాదంమీద జనసంఘం, సోషలిస్టు పార్టీ పోటీచేసి ఓటీ అయిపోయాయి. ఢిల్లీకి ప్రజాస్వామ్య వ్యవస్థను మళ్లీ తీసుకొస్తామని ఈ పక్షాలు వాగ్దానం చేశాయి గాని ప్రజలు ఆ వాగ్దానాన్ని తిరస్కరించారు.

ఢిల్లీ ప్రజాస్వామ్యవ్యవస్థవలన లబ్ధి పొందినవారిలో ఒకాయన రాజస్థాన్ గవర్నరు అయ్యారు. ఇద్దరు మరేవో పదవుల్లో ఉన్నారు. ఇంకా ఇద్దరు లోక్‌సభ అభ్యర్థులయ్యారు. ఇంకొకాయన చౌధురి బ్రహ్మప్రకాష్ చాలా గొప్పగా ప్రవర్తించారు. తాను పదవిలో ఉన్నప్పు డివ్వబడిన అధికార నివాసగృహం వదిలేసి, మోటారుకారు కూడా ప్రభుత్వానికిచ్చేశారు. ఇతరులవలె కేంద్ర మంత్రివర్గంలోకి జొరబడాలనికూడా ఆయన పగటి కలలుకనడం లేదు.

## రాష్ట్రపతి ఎన్నిక

రాష్ట్రపతి ఎన్నికపై అప్పుడే ఊహాగానాలు సాగుతున్నాయి. బాబూ రాజేంద్ర ప్రసాద్ రాష్ట్రపతి పదవికి ఎవరైనా ఒత్తిడి చేస్తేనూ, ప్రజలు కోరితేనూ తప్ప తాను మళ్ళీ నిలబడతానని పట్టుపటలేదు. కాని ఆ తరవాత వ్యాపించిన అభిప్రాయం ఏమిటంటే 1961 దాకా ఆయనే ఉండాలని ఎవరో ఒత్తిడి చేశారని. ఈ అభిప్రాయం ఎలా వ్యాపించిందో తెలియలేదు. మూడోసారికూడా డా॥ రాజేంద్ర ప్రసాదే ఉండేట్టుగా కాంగ్రెసు పెద్దలు ఆయన అనుమతిని పొందారని వార్తలు పొక్కాయి. ఆయనే రాష్ట్రపతిగా ఉంటారని కొన్ని స్థానిక వార్తాపత్రికలుకూడా ప్రచారం చేశాయి. అంటే ఆయన మొత్తం 13½ ఏళ్ళు రాష్ట్రపతిగా ఉన్నట్లవుతుంది.

# రాష్ట్రపతి ఎన్నికపై ఊహాగానాలు

## అధికారం "ఔత్తరాహుగ్రస్తం"

దీంతో న్యూఢిల్లీలో రకరకాల ఆలోచనలు సాగాయి. మొదటిది సంప్రదాయాల సంగతి. మొట్టమొదటి రాష్ట్రపతి మూడు దఫాలవరకూ రాష్ట్రపతిగా ఉండటం సబబేనా? భావితరాలవారికి సంప్రదాయాలను ఏర్పరచబోయేముందు, దేశ ఐక్యతను, సుస్థిరతను దృష్టిలో పెట్టుకుని మరీ ఏర్పరచాలి. కేరళలో ఎన్నికల ఫలితాలు గమనించదగినవి. కేంద్రప్రభుత్వంలో అధికారం ఎక్కువగా "ఔత్తరాహుగ్రస్తం" కావడంపట్ల అది నిరసనగా భావించాలి. శ్రీ కృష్ణమీనన్ లాంటి వ్యక్తినికూడా బొంబాయినుంచి పోటీచేయించవలసివచ్చింది.

ఉత్తరాదిన కొన్ని భాగాలను పారిశ్రామికంగా అభివృద్ధిచేయాలనే ఉద్యమం జోరుగా సాగుతోంది. ఇటీవల వెలువడిన ఒక ఆర్థికనివేదికలో, పరిశ్రమలను నెలకొల్పేటప్పుడు ఉత్తరప్రదేశ్‌కు ప్రత్యేకస్థానమివ్వాలని సూచించబడింది. బీహారులోను పశ్చిమ బెంగాల్‌లోనూ స్థాపించుకోవచ్చునని మొదట్లో అనుమతించబడిన కొన్ని పరిశ్రమలను ఉత్తరప్రదేశ్‌కు ఆకర్షించివేయడం జరిగింది. భారత ప్రభుత్వంకూడా ఈ మార్పును ఆమోదించింది.

సామ్రాజ్యవాదం రకరకాలుగా ఉంటుంది. ఉత్తరాదివారు దక్షిణాదిరాష్ట్రాలను తమ వలసలుగా భావిస్తున్నారని కొందరు దాక్షిణాత్యులు అనుకుంటున్నారు. అందుచేత దాక్షిణాత్యులను ఏదోవిధంగా అనునయించవలసిన అవసరం ఉంది. దక్షిణాదిలో దాక్షిణాత్యులకు లాభసాటి ఉద్యోగాలను ఎక్కువ చేయడం అందుకొక మంచి మార్గం.

ఇదివరకే నేను సూచించినట్లు, కేంద్ర సచివాలయంలో ఉత్తరాది ఉద్యోగుల ప్రాబల్యం తగ్గించి, దక్షిణాది ప్రజలకు, ముఖ్యంగా కేరళ ప్రజలకు అవకాశాలు ఎక్కువ చేయడం అవసరం. అంతేకాక కేంద్రమంత్రి వర్గంలో దక్షిణ రాష్ట్రాలు మూడింటికీ తగు ప్రాతినిధ్యం ఇస్తే, ఉత్తరాది వారిపై ద్వేషప్రచారం తగ్గిపోగలదు. రాష్ట్రపతి పదవికి ఒకసారి దాక్షిణాత్యుణ్ణి, మరొకసారి ఔత్తరాహుణ్ణి ఎన్నుకునే సంప్రదాయం కూడా ఏర్పరచడం మంచిది.

మొట్టమొదటి భారతీయ గవర్నరు జనరల్ శ్రీ సి. రాజగోపాలాచారి. మౌంట్‌బాటెన్ నిష్క్రమించిన తర్వాత ఆయన కొద్ది కాలమే ఆ పదవి నిర్వహించారు. భారతదేశాన్ని రిపబ్లిక్‌గా ప్రకటించగానే ఆయన పదవీ విరమణ చేశారు. రాజాజీ దాక్షిణాత్యుడు. ఆయన తరవాత ఉత్తరాదికి చెందిన బాబూ రాజేంద్రప్రసాద్ రాష్ట్రపతిగా ఎన్నికైనారు. మంచి సంప్రదాయాన్ని ఏర్పరచదలుచుకుంటే, ఈసారి దక్షిణాది నుంచి ఒకర్ని రాష్ట్రపతిగా ఎన్నుకోవడం అవసరం. తమ చేతుల్లో ఎక్కువ ఓట్లున్నాయిగదా అని, అలాంటి సంప్రదాయాన్ని ఏర్పరచకుండా ఉత్తరాదివారు ఎగవేయవచ్చును. మళ్ళీ బాబూజీనే ఎన్నుకోవచ్చును. కాని కేరళలో ఎన్నికల ఫలితాలను చూసి గుణపాఠం నేర్చుకోవడం మంచిది.

అసలు ఈ వివాదాన్ని ఉత్తరాది పత్రికలు ఎందుకు లేవదీశాయీ అని ప్రశ్న. బాబూరాజేంద్రప్రసాద్ తాము మళ్ళీ ఆ పదవికే నిలుస్తామని అంటున్నారా? ఇంతవరకూ ఆయన అలా అన్నట్లు లేదు. మరి ఈ వివాదంలోకి ఆయన్ని ఎందుకు దింపారు? ఆయనకి కాస్త విశ్రాంతి ఇవ్వడం అవసరంకాదా? స్వాతంత్ర్యానికి ముందు ఆయనకి ఎప్పుడూ జైళ్ళకివెళ్ళడం, రావడంతోనే సరిపోయింది. స్వాతంత్ర్యం తరవాత ఆయన చాలా ముఖ్యమైన బాధ్యతలు నిర్వహించారు. మొదట రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుడుగా, తరవాత ఆహారశాఖ మంత్రిగా, తరవాత రాష్ట్రపతిగా పనిచేశారు. ఆయన ఆరోగ్యం చూద్దామంటే అదీ అంతంతమాత్రమే. పాపం ఆయనకి విశ్రాంతి ఇచ్చి, కాలుమీద కాలువేసుకుని కూర్చునే అవకాశం ఇవ్వడం అవసరం కాదా? చర్చిల్‌కూ, అట్లీకీ అలాంటి విశ్రాంతి ఇవ్వలేదా? రాజాజీ మాదిరిగా బాబూజీకి కూడా భారతదేశ సమస్యలను నిష్పక్షపాతంగా పరిశీలించడానికి తగిన అవకాశం ఇవ్వాలి. ఆయన విశ్రాంతి తీసుకుంటున్నప్పటికీ ఆయన సలహాలు దేశానికెంతో అవసరం. ★

# సినిమా

## ★ 'సిండ్రెలా జోళ్లు' ★

"నాయకీ నాయకులు మినహా మిగతా నటీ నటులంతా తమ పాత్రలను చక్కగా ఒప్పించారు" అనిపించే పరిస్థితి ఈనాటి మన చిత్ర పరిశ్రమలో ప్రవర్తిల్లుతోంది అన్నాడొక రచయిత మొన్నీ మధ్య. ఉన్నపళంగా, "ఈ అభిప్రాయంమీద మీ అభిప్రాయం ఏమిటి?" అని ఎవర్నన్నా నిలవేసి అడిగితే 'అబ్సర్డ్' అని జవాబు రావచ్చు.

కాని, ఇటీవలి తెలుగు చిత్రాలూ (కళాఖండాలూ, బాక్సాఫీస్ హిట్‌లూ సహా), వాటి తారాబలాలూ, ఆ తారలు పాత్రలను 'అభినయించిన' తీరులూ, ఆయా పాత్రల బలాలూ ఒక నిముషం మననం చేసుకుని, సరదాకి నిష్పాక్షికంగా ఆలోచిస్తే పై అభిప్రాయం పచ్చి అబద్ధం కాదని అనిపిస్తుంది.



రాజ. శి. ప్రొడక్షన్సు వారి "సతీ అనసూయ" లో అంజలీదేవి

**సినిమా:**

యతిప్రాసల గారడీకోసం ఈనాడు ప్రతి నిర్మాతా రచయితని అతిగా ఆరడి పెడుతున్నాడు. పాటలు పతి వచనంగా ఉన్నా ఫరవాలేదుగాని మాటలు మటుకు యతుల శతాలతో ప్రాసల సహస్రాలతో ఇంకా సాధ్యమైనన్ని అలంకరణలతో ఉండాలి.

ఇప్పటి టిప్పణిలో సినిమా రచయితకు శక్తికన్న ఈ యుక్తి ముఖ్యం.

'అందరూ వచ్చారు' అని వ్రాసే బదులు —

"అంతట్లోకే అందరూ అమాంతంగా అరుదెంచారు అని అనిపించవచ్చును" అని అనగల రచయిత అందరికీ 'రుచిస్తాడు'.

మంచివనిపించుకున్న చిత్రాలలో కూడా, ప్రధాన పాత్రలు బలహీనంగా, నిజానికి నిర్జీవంగా ఉన్నాయనిపిస్తుంది. స్ఫుటమైన రూపురేఖలు, సవ్యమైన, నమ్మదగిన, వ్యక్తిత్వమూ, హేతువాదానికి నిలిచే ప్రవర్తన, ఆలోచనా విధానం కట్టుదిట్టంగా ఉన్న పాత్రలు వేళ్లమీద లెక్కపెట్ట తగినన్ని కూడా లేవు. ఈ పాత్రలు, జీవిత సత్యాలను, గోసాయి చిట్కాలలా ఊహలా గుప్పించేస్తూ ఉంటాయి.

## సందేశాలు; సందేహాలు

దేశానికి సందేశాలివ్వడంమాట దేవుడెరుగు కాని, సందేహశతాలు ప్రసాదించకుండా ఉంటే చాలనిపిస్తుంది ఈ తరహా ప్రబోధాలు వింటున్నపుడు.

"కాణీకి కొరగానివాడు కదా వీడికే చాకు లెక్కడివయ్యా", "ఆ శెట్టి పోయినవాడు అమాంతం ఇట్టొచ్చి పడ్డాడేం", "వీడికిందే బుద్ధి నిక్షేపంలా చదువుకున్నవాడు సంసారుల ఇంట్లో, ఆపిల్లతో కలిసి ఈ కాపున్న లేమిటి?", "ఈ ఆసామి అసలీ కథలో అడుగడుగునా కాళ్ళ కడ్డం పడతాడు వీడి కిక్కడేం పని?", ఇత్యాది వ్యాఖ్యానాలను తెలుగుదేశంలో ఏ థియేటర్ లో కూచున్నా, వినవచ్చును.

## 'సిండ్రెలా జోళ్లు'

చెన్నపట్నంలో కూచుని ప్రజాభిప్రాయాన్ని టోకున అంచనాకట్టేవాళ్లూ, ప్రజాజీవపు మన తత్వాన్ని స్థూలంగా పరిశీలించి, పెద్ద ఎత్తున సిద్ధాంతాలను ఉత్పత్తి చేసేవారూ, వీటిగురించి పట్టించుకోకపోయినా కొట్టొచ్చినట్టు కనబడే నిజాలు మారవు

మొత్తానికి ఇలా అసంగతం అనిపించే లేకిన రూపకల్పన జరిగేపాత్రలు ఎక్కువగా నాయకీ నాయకులవే అనిపిస్తుంది ఏ చిత్రం చూచినా నాయకీ నాయకులు వినా, తల్లి తండ్రులూ, కరణం మునసబులూ, హాస్యగాడూ, దుర్మార్గుడూ, 'చండీ' దాసుడు మొదలైన సహాయ భూమికలన్నీ ప్రశంసనీయంగా ఉంటున్నాయి అయాపాత్రదారులుకూడా తమ ప్రతిభను పాత్ర అవసరాలమేరకు వినియోగించి ఒప్పిస్తున్నారు ఈ తరహా వ్యక్తులను చూచినప్పుడు, మనకు వాళ్లు సుపరిచితులుగా, ఆత్మీయులుగా, మనలా, మన ఇరుగింటి పొరుగింటి వాళ్ళలా కనిపిస్తారు సినిమా అయిపోయిన తరవాత మన మనసులలో మసలుతారు కొందరు రోజుల తరబడి జ్ఞాపకం ఉంటారు మరికొందరు, మన నిత్యజీవితంలో కొందరు వ్యక్తులను, కొన్ని సంఘటనలనూ చూచినప్పుడు జ్ఞాపకం వస్తారు ఆలోచన రేకెత్తిస్తారు

ఇలా ఒక చిత్రంలోని ఒకపాత్రప్రయోజనాత్మకం కావడానికి, ఆపాత్రను ధరించిన నటుడి ప్రతిభతో పాటు, దాన్ని రూపొందించిన రచయిత సామర్థ్యం, ఉపయోగించిన దర్శకుడి చాకచక్యంకూడా సమానంగా దోహదంచేస్తాయి

"మేలుకోలుపు" లో సి ఎస్ ఆర్, "పెంకిపెళ్లాం" చిత్రంలో సూర్యకాంతం, "భాగ్యరేఖ" లో రమణారెడ్డి, ఇంకా ఇలాగే గుమ్మడి, చదలవాడ, హేమలత, వంగరవంటి నటీనటుల ద్వారా స్మరణీయములైన భూమికలు అనేకం తెలుగుతెర నలంకరించాయి వాటిని నిర్వహించిన నటీనటుల ప్రతిభ కూడా ప్రశంసలు అందుకుంది, అందుకుంటోంది



హాలీవుడ్ కంపెనీ యూనివర్సల్ ఇంటర్నేషనల్ వారి "బాటిల్ హిమ్" (సమర గీతి) చిత్రంలో ముఖ్య భూమిక నిర్వహిస్తున్న భారత నటి అనా కాష్ఫీ కొరియా యుద్ధంలో తల్లి తండ్రులను కోల్పోయి అనాథులైన పిల్లలకై నెలకొల్పిన కేంద్రం నిర్వాహకురాలుగా ఈమె నటిస్తోంది అనా జన్మస్థలం కలకత్తా ఆమె వయసు 21 సంవత్సరాలు "బాటిల్ హిమ్" చిత్రంలో రాక్ హడ్సన్, మార్తాహేయర్, మొదలుగువారు నటిస్తున్నారు

### రెండు కాళ్లు

కాని, నాయకీ నాయకుడూ అనే రెండు కాళ్ల పరిస్థితిమాత్రం ఈ విధంగా లేకపోవడం బాధాకరమే అయినా, దీనికి కారణం ఈ నాడు ఆ పాత్రలు ధరిస్తున్న నటీనటులు ప్రతిభ లేనివారు కావడం అని ఎవరూ అనలేరు కాని, అనేక కారణాలవల్ల, కారణాంతరాలవల్ల వారు ఎంత కృషి చేసినా, ఆయా భూమికలు ప్రేక్షకుడి హృదయానికి హత్తుకోవటంలేదు జనం ఎందుకు అంత మోజుగా ఉన్నారూ అంటే, ఆ నటనటుల ప్రతిభమీద ఉన్న గురి, వారిపట్ల గల అభిమానం కారణం

ఎంత నేడ్డవేషమైనా, ఫలానా వారునటిస్తే బాగుంటుంది గదా అన్న ధీమా ప్రేక్షకుడిలో ఈ విధమైన నమ్మకం ఉండడం, పెరగడం వెయ్యోళ్ళకీ కావలసినదే కాని అది నిర్మాతకీ నటుడికీ మాత్రం ప్రాతిపదిక, పట్టుగొమ్మ అవటం మంచిది కాదు

చిత్రంవచ్చినట్టు కథని అల్లి, దాన్ని కొండమీద నెలయేరులా పరుగులెత్తిస్తూ, దానిమీద పడవల్లా పాత్రలను నడిపేస్తూ సినిమా తీస్తే మంచిఫలితాలు రావు నటీనటులు ఎంత ప్రతిభావంతులైనా వారి కృషి రాణించదు

### దేవదాసు, నాగరాజు

నాగేశ్వరరావు నటించిన పాత్రలన్నిటిలో అత్యురాలా బహుళజనాదరణ పొందినది, నటుడికి గౌరవాన్ని చేకూర్చినది "దేవదాసు"

ప్రస్ఫుటమైన రూపురేఖలు, నిండు నిండు ప్రాణాలూ, సమగ్ర వ్యక్తిత్వం ఉండి, స్వయంగా రెండు కాళ్ళమీద నిలబడగల ఈ భూమికకు అంత పరిపూర్ణత ఉండడం ఇది ప్రజాదరణ పాత్రం కావడానికి చాలా దోహదం చేసింది నాగేశ్వరరావు దానికి

ప్రాణప్రతిష్ఠ చేశాడు అందుకనే ఈ నాటికీ చాలామందికి దేవదాసు చిత్రం, అందులో నాగేశ్వరరావు నటనా బాగా జ్ఞాపకం ఉన్నాయి

అలాగే మల్లీశ్వరిలో ఎన్ టి రామారావు నిర్వహించిన నాగరాజు భూమికను, "పాతాళభైరవి" లో తోటరాముడి పాత్రనూ, ఉన్నంతలో కట్టుదిట్టమైన రూపకల్పన జరగడంవల్లనే అవి ఉత్తమంగా భాసించాయి

వీరు నటించిన ఇతర పాత్రలు కొల్లలుగా ఉన్నాయి ఈ రెండు మాదిరిలా అవి రాణించక పోవడానికి కారణం వీరికి ప్రతిభ లేకపోవడం అని ఎవరనగలరు?

## కారణాల తోరణాలు

ఈ నాడు తారాబలం ఉన్న చిత్రం కూడా దెబ్బతినే పరిస్థితి ఏర్పడడానికి ఒక కారణం వ్యాపారదృష్ట్యా అత్యధిక ప్రాధాన్యం వహించే నటీనటులిద్దరూ నిర్వహించే ముఖ్యపాత్రల రూపకల్పనకు, కథా చిత్రణదృష్ట్యా ఉండతగు ప్రాధాన్యం లేకపోవడం ఈ ఇద్దరూ దేశానికో రెండు సందేశాలు వినిపించి, రెండుమూడు పాటలు పాడి, విడిగాను జంటగాను రెండు మూడు నృత్యాలుచేసి, ఒకటి రెండుసార్లు కంట తడి పెట్టుకుని, జుట్టు పీకుకుని, చివరకు మళ్లీ ముస్తాబై "హాయిగా" అని యుగళగీతం ఆలపిస్తే చాలునన్న బాధ్యతారహితమైన దృక్పథం మరో కారణం

సింగ్రేలా జోళ్లను సింగ్రేలాకే కాక, కొండొకరికి తొడుగబోవడం ఇంకో కారణం ఈ నాటి అగ్రశ్రేణి నటీనటుల విగ్రహాలకూ, తీరుతెన్నులకూ ఇది తప్పుతుందా, వారు దీన్ని ఒప్పించగలరా అన్న దృష్టి లేకుండా, నటీనటులను తీసుకోవడం పరిపాటి అయిపోయింది ఇది నాయకీనాయకుల విషయంలోనే ఎక్కువగా జరుగుతోంది ఇతర పాత్రల విషయంలో కాస్త్రాస్థీను సూత్రధారులకు అట్టే పట్టింపులు ఉండవు కాబట్టి, తగినవారినే తీసుకోవడం జరుగుతోంది

## పదేపదే అదేపాట

ఇందులో ఇంకో విశేషముంది ఇటీవల కొంతకాలంగా, ఒక నటిగాని, నటుడుగాని ఒకరకం భూమికను బాగా ఒప్పించి ఓహో అనిపించుకుంటే, మర్నాటినుండి విడుదలఅయ్యే చిత్రాలలో ఆ ఆసామిని, అదేరకం వేషంలో తరచూలో చూస్తాము ఒకసారి రాణించిందని, కొన్ని ఫుల్ స్టాపులూ, కామాలూ లేదాగా, అదే భూమికను పదే పదే నటించబోవడం ఏవిధంగాను మంచిది కాదు. ఇలా మార్పు లేని గాడిలో, లోగడ శ్రీ తంగర వెంకట సుబ్బయ్యచేత, ఇటీవల కొన్నాళ్ళుగా శ్రీమతి సూర్యకాంతంచేత మూసపోసిన పాతవేషాలు వేయిస్తూవచ్చారు ఆ వేషాలకి కథలో ఎంతవరకూ స్థానం ఉందన్న సంగతిని ఎవరూ పట్టించుకోరు దీని పర్యవసానాలు బ్రహ్మాండంగా ఉంటాయని చరిత్ర చెప్పటం లేదు

ప్రజాభిప్రాయము అసగా నేమి?

ప్రజలు ఏమనుకుంటున్నారు అన్న విషయమై ప్రజలు ఏమనుకొంటున్నారు అన్నదే

ఈ ధోరణి, సినిమాలు తీసేవారికీ, చూసే వారికీ కూడా అమందానందప్రదాయకం కాగల దనిపించదు ★



సారథీవారి "పెద్దరికాలు" చిత్రంలో హేమలత, డా॥ జి వి సుబ్బారావు, జగ్గయ్య, అంజలి.

# ప్రముఖ దర్శకుడు అమియచక్రవర్తి మృతి

"సీమ," "పతిత," "దాగ్" మొదలగు చిత్రాలు నిర్మించిన ప్రముఖదర్శకుడు అమియచక్రవర్తి, గుండెజబ్బువల్ల, మార్చి 6 వ తేదీన మృతిచెందారు. ఆయనకు 45 సంవత్సరాలు.

బొంబాయి ఫిలింపరిశ్రమలోని చిన్నా పెద్దా అందరూ ఆ రోజున అమియచక్రవర్తి ఇంటికివెళ్ళి ఆయనకుటుంబానికి సానుభూతి తెలియజేశారు.

మరణకాలంనాటికి, ఆయన కొత్తచిత్రం "కాథ్ పుత్లి" నిర్మాణం సాగిస్తున్నారు. మరణించినక్షణాన ఆ చిత్రానికి సంబంధించిన విషయాలేవో వ్రాసుకుంటున్నారు. స్థలం కూడా ఒక ఫిలిం స్టుడియో...

అమియచక్రవర్తి విద్యార్థిజీవితం రాజకీయ కార్యకలాపాలలో సాగింది. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని కారాగారం కూడా అనుభవించారు. అనంతరం, 1958లో ఒక శ్రేయోభిలాషి ఆహ్వానంపై బొంబాయి టాకీస్‌లో చిన్న ఉద్యోగంలో చేరారు. స్వర్గీయ హిమాంశురాయ్, ఫ్రాంజ్ ఆస్టెన్ ప్రభృతులవద్ద చలనచిత్రకళను అభ్యసించారు. కొంతకాలంపాటు చలనచిత్రాలకు స్క్రిప్టు వ్రాశారు.

అమియచక్రవర్తి దర్శకత్వంవహించిన తొలిచిత్రం "అంజాన్." తరువాత "బసంత్," "జ్వార్ భటా," "పునర్మిలన్" మొదలగు చిత్రాలు తీశారు.

తరువాత 'మార్స్ అండ్ మువీస్' పేరిట స్వంతంగా ఒక చిత్రనిర్మాణసంస్థ నెలకొల్పి, 'దాగ్,' 'పతిత,' 'సీమా,' నిర్మించారు. ఆయనఇటీవలిచిత్రం "దేఖ్ కబీరా రోయా" ఇపుడు వివిధ కేంద్రాలలో ప్రదర్శించబడుతోంది.

అమియచక్రవర్తికి భార్య, ఒక కుమారుడు ఉన్నారు. ★



సిల్వర్ వింగ్స్ అనే కంపెనీవారు పిల్లలకై ఒక చలనచిత్రం నిర్మిస్తున్నారు. పేరు "ద్వో ఫూల్"

ఒక ప్రసిద్ధ పాశ్చాత్యగాథ ఆధారంగా రూపొందించిన ఈ కథకు శ్రీ కిషన్‌చందర్ సంభాషణలు వ్రాస్తున్నారు.

ఈ చిత్రానికి ఎ. ఆర్. కర్దార్ దర్శకుడు. బేబీనాజ్, మాస్టర్ రోమీ, విజయ్ చౌదరి, అమీర్ బానూ, శ్రీ ఎ. పి. కపూర్ ఇందులో పాల్గొంటారు.

ఈ చిత్రానికి శ్రీ వసంత్ దేశాయ్ సంగీతం సమకూర్చుతారు

బాల చలనచిత్ర సంస్థ కొన్నాళ్ళక్రితం ప్రారంభించిన చిత్రం "లైట్ హౌస్" నిర్మాణం పూర్తి అయిందికాని ఇంకా విడుదలకు ఏర్పాట్లు జరుగలేదు.

మద్రాసు ఎ. వి. ఎం. స్టుడియోలో సదాశివ్ రావ్. జె. కవి దర్శకత్వాన "హం పంఛీ ఔర్ దల్ ఏక్" పేరిట పిల్లలకైమరో చిత్రం తయారవుతోంది. ఇందులో మాస్టర్ రోమీ, అతడి తల్లిగా అచలాసచ్‌దేవ్ నటిస్తున్నారు. ఇపుడు కర్దార్ స్టుడియోలో ప్రారంభంఅయిన "ద్వో ఫూల్" కూడవది. ★

# ఫిలింస్ డివిజన్ వారి ప్రయోగాత్మక పథకం

కేవలం వార్తా చిత్రాలూ, డాక్యుమెంటరీలూ మాత్రమే చూడటానికి జనం డబ్బిచ్చి టిక్కెట్లు కొనుక్కుంటారా?

ఈ ప్రశ్నకి జవాబు తెల్సుకోవడానికి భారత ప్రభుత్వ ఫిలింస్ డివిజన్ వచ్చే నెల ఒక ప్రయత్నం చేయబోతోంది.

ఢిల్లీలోని ఫిలింస్ డివిజన్ థియేటర్‌లో, ప్రయోగాత్మకంగా డాక్యుమెంటరీ చిత్రాల ప్రదర్శనాలు నిర్వహించి, ప్రజలు వీటిని ఏ మాత్రం ఆదరించేదీ చూడాలని నిర్వాహకులు సంకల్పించారు. అక్కడ లాభసాటిగా ఉంటే, ఇతర ప్రముఖ నగరాలలో కూడా ఈ ఏర్పాట్లు చేస్తారట.

బాక్సాఫీస్ హృదయం అవగతంచేసుకున్న పెద్దలు ఈ వార్త విని గంభీరంగా తల తాటించి, "ప్రజల కిది కరినపరీక్ష; ఆ మాటకొస్తే అగ్నిపరీక్ష" అన్నారు.

ఇది అక్షరాలా నిజం కాకపోయినా, నిజానికి ఆమడదూరానమటుకు లేదు. ఈ ప్రదర్శనం ఏర్పాటుఅయినరోజు ప్రొద్దుటే, ప్రజలు విరిగబడి టిక్కెట్లు కొనేసి హాలు క్రిక్కిరిసిపోయేలా వచ్చేస్తారని భ్రమపడ నవసరం లేదు.

ఎందుకంటే స్థూలంగా ప్రబోధాత్మకాలయిన మన డాక్యుమెంటరీ చిత్రాలూ, వర్తమాన పరిస్థితులనుబట్టి ప్రధానంగా ప్రచారాత్మకాలు (ప్రణాళిక) గా రూపొందుతున్న వార్తా చిత్రాలూ ఎంతటి ఉత్తమ ప్రమాణాలనందుకున్నా హఠాత్తుగా బాక్సాఫీస్ హిట్‌లు అయిపోవడం అసంభవం.

ప్రాణం విసుగెత్తి కాస్తవినోద కాలక్షేపానికి బయల్దేరే ప్రేక్షకుడు, వినోదం ప్రధానంగా ఉండే చిత్రాలకే డబ్బులిచ్చుకు వెళ్ళడం సహజం.

అందువల్ల, ఇప్పటికిప్పుడు కాకపోయినా క్రమక్రమంగానైనా ప్రత్యేకం ఈ చిన్న చిత్రాలనే ప్రజలు ఆదరించాలంటే, ప్రదర్శనకాలంలో, డాక్యుమెంటరీ, వార్తా చిత్రాలతో పాటు, చిన్న చిన్న కథా ప్రధాన చిత్రాలకు కూడా చోటు కేటాయించాలి. రెండు మూడు వేల అడుగులకు మించని చిత్రాలు నాలుగైదింటిని

# ★ అణ్వానంతర శాంతి ★

(34-వ పేజీ తరువాయి)

ఇవ్వను, అందరికీ పూర్వం అప్పలిచ్చి బహు కీర్తి సంపాదించాను. ఇక నాకు ప్రచారం చచ్చినా అనవసరం.

సభాపతి: అల్లాగని ఒకేఒక భూభాగం నాకిచ్చి నా నెత్తికి బురదపూయాలంటారా? ఈ అన్యాయాన్ని ఏనాటికీ నేను సహించలేను.

సి: అయితే చూడండి! ఈ చర్చను అనిశ్చితంగా వాయిదా వేద్దాము. దీనికి మీ రేమంటారు?

ఏ } మీ: ప్రతిపాదన ఏకగ్రీవంగా
సభాపతి } ఒప్పుకుంటున్నాము.

సభాపతి: సరి. ఈ ప్రతిపాదన ఏకగ్రీవంగా ఆమోదింపబడింది. ఇక చర్చించవలసిన రెండో విషయం అగ్గిపెట్టెల పంపకం (సిలోటి) మీరు మాట్లాడండి.

సి: ప్రపంచం మనకెంత ముఖ్యమయిందో అగ్గిపెట్టెలూ అంతేముఖ్యం. ఇప్పుడు మనకు ప్రాణాధారంగాఉన్న సిగరెట్లకివి అమితంగా అవసరమైనవి. కాబట్టి, ఇవి ఏ ఒక్కరి దగ్గర ఉన్నా-ఒకటికంటే ఎక్కువున్నాయి కాబట్టి—మిత్రత్రయ మండలిలో సమానంగా పంచబడటమ నేది న్యాయ సమ్మతమయింది. అసమానమైన ఆస్తులవల్ల ఎన్నో నష్టాలున్నవి. మండలి దీన్ని గూర్చి తీక్ష్ణంగా విచారించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

ఏ: (ఎగతాళిగా) ఎంత బాగా సెలవిచ్చారు! నేనుకష్టించి సంపాదించిన ఆస్తిపై మీ అధికారమా? అందరికీ పంచాలా? ఈ అన్యాయం ఏమాత్రం సహించేది లేదు.

సి : సభాపతీ! మీ అభిప్రాయం?

సభాపతి : నా అభిప్...

ఏ . ఇందులో సభాపతి అభిప్రాయానికీ, నిర్ణయానికీ తావులేదు. చర్చకు కూడా ఇందులో ఏమాత్రమూ స్థానంలేదు. నా ఇష్టప్రకారం ఏదో ఇస్తాను. ఇష్టమైతే తీసికోండి. కష్టమైతే...

సభాపతి : అయితే ఎన్ని ఇస్తామంటారు?

ఏ : చెరి రెండిస్తాను. అంతకన్న నే నివ్వలేను. ఆపై మీ ఇష్టం.

సభాపతి ఇది పూర్తిగా న్యాయవిరుద్ధం. ప్రపంచ విభాగసమయంలో అల్లా మాట్లాడారు. ఇప్పుడిల్లా చేస్తున్నారు. నే దీన్ని సహించలేను. పూర్తిగా వ్యతిరేకిస్తున్నాను.

సి నేను సభాపతితో ఏకీభవిస్తున్నాను.

ఏ సిగ్గుచేటు - మీరు నవప్రపంచశాంతి స్థాపనకు పూనుకున్నారా? పోట్లాటకా? ఎంత హాస్యాస్పదం! (కనుబొమలెగరేస్తాడు)

సభాపతి : నవప్రపంచ నిర్మాణం నాశనం కానీండి. ముందా అగ్గిపెట్టెలు మండలి స్వాధీనంచేసుకోవాలని నిర్ణయిస్తున్నాను అప్పుడే సరిఅయిన న్యాయం జరుగటానికి వీలుంటుంది.

సి : నేను సభాపతితో ఏకీభవిస్తున్నాను.

ఏ : (లేచి కోపంగా కాలితో నేలను తన్ని) ఏట్లోపడి చావండి. మీ వ్యర్థప్రలాపన ఇక వినలేను. ఈ మండలి చాలా అన్యాయంగా, అసహ్యంగాకూడా ప్రవర్తిస్తూ మరీ నీచాలకు జారుతున్నది. ప్రపంచ మానవత్వాన్నీ, వ్యక్తిస్వత్వాన్నీ నిర్మూలించటానికి పూనుకుంది. ఈ కుచక్రంలో నేపడదలచుకోలేదు. నేనుఈమండలిని ధిక్కరించి వదిలేస్తున్నాను. (చర చరా వెళ్ళిపోతాడు)

సి : ఇప్పు డేంచేయాలి సభాపతీ.

సభాపతి : (ఒక్కసారి తలగోక్కొని - వెంటనే సి-చెవిలో ఏదో గుసగుసలాడి సంతోషంగా) ఎల్లా ఉంది?

సి : బాగానే ఉంది. కాని మొదటివారికి మనం అసమ్మతి పత్రం అందజేయవలసి ఉంటుందేమో?

సభాపతి . అరె! మీరెంత అజ్ఞానంలో పడ్డారు? నేను సభాపతిని. నాకన్నీ తెలుసు. ఆ పత్రం తరువాత పంపవచ్చు. మనపని కానిద్దాం. లేవండి. (ఇద్దరూ వెళ్తారు. రెండు నిమిషాలతరువాత రివాల్వరు ధ్వనీ, ఏ యొక్క ఆర్తధ్వనీ వినవస్తాయి. మళ్ళీ సభాపతి - సి - రంగంమీదికి వస్తారు)

సభాపతి : (చేతులు దులుపుతూ) అబ్బ! ఇవ్వాళ్ళటికి నాకు మహదానందంకలిగింది. ప్రపంచాభివృద్ధి ధ్వంసకశక్తిని సమూలంగా నాశంచేశాము. ఇక శాంతే శాంతి. హాయిగా సిగరెట్ వెలిగించుకొందాం. (సిగరెట్టుతీసి) ఏవి మిత్రమా! నాలుగు అగ్గిపెట్టె లివ్వండింది.

సి : (ఆశ్చర్యంగా) నాలుగేమిటి?

సభాపతి. ఆ విధ్వంసకశక్తిని ధ్వంసంచేసి ఎనిమిదిపెట్టెలు సంపాదించాంగా. వాటిలో సగభాగం నాలుగు, నా నాలుగు నాకివ్వండి.

సి: (విచారిస్తున్నట్టు) అయ్యో సభాపతీ! మీలో న్యాయం ఏ కోశానా లేదు. ధ్వంసం చేసింది నేను గదా.

సభాపతి కానిఅసలుఆసూచనచేసింది నేను.

సి : అయితే నేం? నేను వ్యతిరేకిస్తే ఏమయ్యేది. అయినా న్యాయంగా, వాగు మీకిస్తామన్న వాటికన్నా ఎక్కువగా, అంటే మూడు పెట్టెలిస్తాను

సభాపతి(కోపంపట్టలేక) ద్రోహీ! (మీది కురుకుతాడు సి రివాల్వర్ తో కాల్చి అతన్ని చంపేసాడు. ప్రక్కరాయిమీద కాలుమీద కాలేసుకుని - ఏమీ జరగనట్లే సి సిగరెట్టంటించుకొంటాడు )

సి : ఈనాటికి ప్రపంచంలో నిజమైన శాంతి స్థాపించాను. ఇక భావిప్రపంచం సర్వ సమృద్ధమవుతుంది. ఏక మిత్రమండలి వర్ధిల్లాలి. వర్ధిల్లాలి. (బాగా పీల్చి పొగ మబ్బులా వదుల్తుంటాడు.)

[శ్రీ లక్ష్మీచంద్ర జైన్ రచన ఆధారంగా] ★



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.